శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



# శ్రీమణవాళ మహామునుల వైభవమ్

(శ్రీమణవాళ మహామునుల తిరునక్షత్రోత్సవాల సందర్భంగా ప్రపన్నుల సన్నిధిలో ఉపహారంగా సమర్పింపబడుతున్నది.)



మలయప్పస్వామి



'పండితరత్న' డా॥ ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి అహ్లాగ శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు



పొలిందు నిన్ఱపిరాన్, ఆళ్వార్ తిరునగరి



శ్రీమణవాళ మహామునులు, ఆళ్వార్ తిరునగరి




శ్రీమాన్ ప్రతివాది భయంకర అణ్ణంగరాచార్య స్వామి

# విషయసూచిక

# శ్రీమణవాళ మహామునుల వైభవమ్

(వాగమృతవర్షి, ఉ. వే. శ్రీమాన్, వేళుక్కుడి వరదాచార్యస్వామివారి ద్రావిడవ్యాసం ఆధారంగా)

శ్రీ వైష్ణవ సంప్రదాయంలో ఎందరో ఆచార్యులు ప్రకాశిస్తూ ఉన్నప్పటికీ, ముగ్గురు ముఖ్యంగా లెక్కింపబడుతున్నారు, వారు– నమ్మాళ్వారులు, నంబి రామానుజులు, నమ్ మణవాళ మామునులు అనేవారు. ఆళ్వార్ తిరువడిగళే శరణం, ఎంబెరుమానార్ తిరువడిగళే శరణం, జీయర్ తిరువడిగళే శరణం –అని శ్రీవైష్ణవలోకం అంతా వీరిని నిత్యం అనుసంధానం చేస్తున్నది. వీరిలో, నమ్మాళ్వారుల మహిమ కంటే శ్రీరామానుజుల మహిమ గొప్పది, ఈ ఇద్దరి మహిమ కంటే మణవాళ మహామునుల మహిమ గొప్పది, అంటే, వీరి మహిమ సాటి, మేటి లేనిది. ఆచార్య పదవిని అలంకరించటానికి తగిన సద్గుణాలు అన్నీ మణవాళ మహామునులలో గూడు కట్టుకొని ఉన్నాయి–అని అంటే, అది ఎంత మాత్రం అతిశయోక్తి కాబోదు. వీరు అవతరించినది ఆళ్వార్ తిరునగరిలో. వీరి తండ్రిగారి తిరునామం– తికழ் కిడందాన్ తిరునావీఱుడైయ పిరాన్ దాసర్ అణ్ణన్. కలియుగం ఆరంభమైన తరువాత నాలుగు వేల నాలుగు వందల డెబ్బైరెండవ సంవత్సరం అయిన సాధారణ వర్షంలో అల్పిశి మాసంలో మూలా నక్షత్రంలో ఆదిశేషుల అంశగా, భగవద్రామానుజుల అపరావతారంగా వీరు అవతరించారు. ఈ విధంగా లోకానికి అంతటికి అద్వితీయమైన ప్రాణస్థానీయులుగా అవతరించిన ఈ దివ్యమూర్తికి శ్రీ రంగనాథుని తిరునామాన్ని పెట్టాలని కోరిన పెద్దలు, "అழగియ మణవాళన్" అనే పేరును పెట్టారు. " అழగియ మణవాళ నాయనార్" అనే విలక్షణమైన తిరునామంతో వీరు వ్యవహరింపబడ్డారు.

శ్రీవైష్ణవాచార్యపరంపరలో శ్రీ పిళ్లైలోకాచార్యులవారు అనేవారు ఒక మహాచార్యులు. వీరు రహస్యత్రయంలోని అర్థాలను 18 గ్రంథాల రూపంలో అనుగ్రహించారు. వీరి శ్రీచరణాలలో, వీరి శిష్యులైన కూరకులోత్తమ దాసర్ శ్రీచరణాలలో

చిరకాలం సేవించి, అరుదైన గొప్ప అర్థవిశేషాలను చక్కగా గ్రహించినవారు, నమ్మాళ్వారులు అనుగ్రహించిన ఆర్ద్ర వచనాలలో ఉండే అభినివేశం కారణంగా తిరువాయ్ మొ*ఴి* ప్పిళ్లై అనే విలక్షణ నామాన్ని కలిగినవారైన తిరుమలై అ*ఴ*ివార్ (శ్రీశైలేశులు) అనే ఆచార్యుల పాదాలను ఆశ్రయించి, సంప్రదాయార్థాలను మణవాళ మహామునులు పొందారు. మన పూర్వాచార్యులు అందరూ శ్రీరంగదివ్య క్షేత్రంలోనే వేంచేసి ఉండి, దర్శన నిర్వాహన్ని చేస్తూ కాలం గడిపినందున, మామునులు కూడా శ్రీరంగ క్షేత్రం చేరి, అక్కడ శ్రీరంగనాథునిచే, సకల శ్రీవైష్ణవులచే గొప్పగా గౌరవింపబడుతూ, తమ శిష్యులకు సంప్రదాయ సదర్థాలను అనుగ్రహిస్తూ, కాలం గడుపుతూ వచ్చారు. గృహస్థాశ్రమాన్ని వదలి పెట్టి సన్యాసాశ్రమాన్ని స్వీకరించి, మణవాళమామునులు అనే పేరుతో వెలుగొందారు. వానమామలై క్షేత్రంలో మహా జ్ఞానిగా వేంచేసి ఉండే "అ*ఴ*కియ వరదర్" అనేవారు పరమ వైరాగ్యంతో సన్యాసాశ్రమాన్ని స్వీకరించి, శ్రీరామానుజ జీయర్ అనే పేరును కలిగి ఉన్నారు. వారు మణవాళ మహామునుల పాదాలను ఆశ్రయించారు. వారే మణవాళ మహామునుల ముఖ్య శిష్యులు. మామునుల శిష్యులలో ఎనిమిది మంది ప్రాధాన్యాన్ని పొంది, అష్టదిగ్గజాలు అనే విలక్షణమైన పేరుతో లోకంలో ప్రసిద్ధిని పొందారు. వారి తిరునామాలు ఏమి? అంటే, వానమామలై జీయర్, పట్టర్ పిరాన్ జీయర్, తిరువేంగడ రామానుజ జీయర్, కోయిల్ అణ్ణన్, ప్రతివాది భయంకరమ్ అణ్ణన్, ఎఱుంబి అప్పా, అప్పిళ్లై, అప్పిళ్ళార్ అనేవారు. వీరేకాక నవరత్నాలు అనే పేరుతో కొందరు శిష్యులు కూడా ఉండేవారు– సేనై ముదలియాండాన్ నాయనార్, శడకోప దాసరాన నాలూర్ శి*ఱ్ఱ*ా*త్తా*న్, కందాడై పోరే*ఱ్ఱు* నాయన్, ఏట్టు సింగరాచార్యర్, కందాడై అణ్ణప్పన్, కందాడై తిరు గ్గోపురత్తు నాయనార్, కందాడై నారాయణప్పై, కందాడై తో*ఴ*ప్పారప్పై, కందాడై అ*ణ్ణ*ఴ*త్తు* వా*ఴ*ివిత్త పెరుమాళ్ అనే 9 మంది నవరత్నాలు. మణవాళ మహామునులకు పూర్వాశ్రమంలో కుమారుల పేరు రామానుజ దాసులు. మనుమలు జీయర్ నాయనార్ అనే ప్రసిద్ధి పొందిన అ*ఴ*గియ మణవాళ నాయనార్.

కోయిల్ కండాడై అణ్ణన్ అనేవారు, శ్రీ రామానుజులకు ముదలియాండాన్ వలె, పాదుకాస్థానీయులై ఉండేవారు. ఎఱుంబియప్పా, వడుగనంబివలె, " తేవు మఱ్ఱఱియేన్" (వేఱొక దైవాన్ని తెలియను) అనే విధంగా "మణవాళ మహామునులే పరదైవం" అనే విశ్వాసాన్ని కలిగి ఉండేవారు. ప్రతివాది భయంకరమ్ అణ్ణన్, కూరేశుల వలె, కుడిభుజంవలె సహాయంగా ఉండేవారు. అప్పిళ్ళార్ ఉఱంగావిల్లి దాసర్ వలె, మఠంలో అన్ని బాధ్యతలను నిర్వహించేవారు. వానమామలై జీయర్, అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమానార్ వలె, ఆశ్రయించిననాటి నుండి విడువకుండా నీడవలె వెంట ఉండేవారు, పట్టర్ పిరాన్ జీయర్ గోవిందదాసర్ అనే తిరునామాన్ని కలిగినవారై, 30 సంవత్సరాల కాలం విడువకుండా ఉండి, మహావిరక్తులై, తాము జీయర్ అయిన తరువాత కూడా, మణవాళ మహామునులను విడిస్తే నిలువ లేకుండా, వారికి సేవ చేయడంలోనే ఎంబార్ వలె పాదచ్ఛాయవలె ఉండేవారు. జీయర్ నాయనార్ తిరుక్కురుకై ప్పిరాన్ పిళ్ళాన్ వలె అత్యాదరణీయులై ఉండేవారు.

“శ్రీమాన్ సుందరజామాతృమునిః పర్యాయభాష్యకృత్,
భాష్యం వ్యాకుర్వతః తస్య శ్రోతృకోటౌ మమాన్వయః. "

అనే విధంగా శ్రీరామానుజుల అపరావతారం అయిన పెరియజీయర్ భూప్రదక్షిణం చేసి, అనేక స్థలాలను జీర్ణోద్ధరణం చేశారు. తిరునగరిలో తిరువాయ్ మొழிప్పిళ్ళై కు తమ నిజస్వరూపమైన శేషావతారాన్ని చూపించారు. పరమత నిరసన, స్వమతస్థాపనాలను చేశారు. సర్వాదిస్థావర జంగమాదులకు మోక్షాన్ని అనుగ్రహించారు. ఉత్తర మధురలో జీర్ణోద్ధారణం చేశారు.

మణవాళ మహామునులకు ఉండే గొప్పతనాలలో అతిముఖ్యమైన గొప్పతనం— శ్రీ రంగనాథునకు కాలక్షేపం అనుగ్రహించిన గొప్పతనం. ఆ స్వామి శ్రీ మణవాళ మహామునుల దగ్గర తిరువాయ్ మొழி ప్రబంధంలోని అర్థాలను వినాలని ఆశపడి,

ఒకనాడు వారిని తన దగ్గరకు పిలిపించుకొని, " జీయరే! రేపటినుండి ఆరంభించి నా ఆలయంలోని పెరియ తిరుమండపంలో వేంచేసి ఉండి, నమ్మాళ్వారుల తిరువాయ్ మొழி ప్రబంధానికి కల ఈడు ముప్పత్తాఱాయిరప్పడి మొదలైన అన్ని వ్యాఖ్యానాలతో ప్రవచనం చేయండి" అని నియమించాడు. మణవాళ మహామునులు కూడా శ్రీరంగనాథుని దివ్యాలయంలో భక్తులందరూ కూడి ఉన్న గోష్ఠితో, పెద్ద సభలో వేంచేసి ఉండి, ఈడు మొదలైన ఐదు వాఖ్యానాలతో తిరువాయ్ మొழி ప్రబంధాన్ని వివరిస్తూ, " ఇది శ్రుతి ప్రక్రియ, ఇది శ్రీభాష్య ప్రక్రియ, ఇది శ్రుతప్రకాశికా ప్రక్రియ, ఇది గీతా భాష్య ప్రక్రియ, ఇది పాంచరాత్ర ప్రక్రియ, ఇది శ్రీరామాయణ ప్రక్రియ, ఇది మహాభారత ప్రక్రియ, ఇది శ్రీవిష్ణు పురాణ ప్రక్రియ, ఇది మహాభాగవత ప్రక్రియ, ఇది పదార్థం, ఇది వాక్యార్థం, ఇది మహా వాక్యార్థం, ఇది వ్యాఖ్యార్థం "అని అద్భుతంగా, "విశదవాక్ శిఖామణి" అనే తమ బిరుదు ప్రకాశించేటట్లుగా, సర్వజ్ఞ సార్వభౌములు అనే పట్టం గొప్పగా వెలిగేటట్లుగా ప్రవచనం చేస్తూ వచ్చారు. శ్రీరంగనాథుడు ఉభయదేరులతో దివ్య సింహాసనంలో వేంచేసి ఉండి, ఒక సంవత్సరం పాటు ఆ ప్రవచనాన్ని ఆలకించాడు. ప్రవచనం పూర్తి అయిన నాడు ఆ స్వామి నాలుగైదు సంవత్సరాల వయసు కలిగిన అర్చకబాలుని రూపంతో గోష్ఠి మధ్యలో వచ్చి, చేతులను జోడించి నిలచి, "శ్రీ శైలేశ దయాపాత్రమ్" అని ఆరంభించి, 32 అక్షరాలను కలిగిన, తిరుమంత్రం అనదగిన తనియన్ శ్లోకాన్ని విన్నపించి, అంతర్ధానం అయినాడు. ఈ అద్భుతమైన సందర్భాన్ని చూచి, అందరూ ఆశ్చర్యచకితులయ్యారు. ఆ తనియన్ శ్లోకాన్ని పత్రంలో రాసి, దానికి పసుపును పూసి, శ్రీరంగనాథుని పాద సన్నిధిలో సమర్పించి, తీసి పళ్ళెంలో పెట్టి, అక్కడ ఉండే పెద్దలంతా గొప్పగా ప్రశంసించారు. "సంస్కృత వేదానికి ఓంకారం వలెనే, ద్రావిడ వేదానికి ఈ తనియన్ శ్లోకం మొదట చివర అనుసంధింపబడాలి" అని శ్రీరంగనాథుడు ఆజ్ఞాపించాడు.

శ్రీ పిళ్లై లోకాచార్యులవారు అనుగ్రహించిన 18 రహస్య గ్రంథాలలో శ్రీ వచన భూషణం, తత్వత్రయం, ముముక్షు ప్పడి –అనే మూడు రహస్య గ్రంథాలకు శ్రీ మణవాళ

మహాముసులు అత్యాశ్చర్యకరమైన వ్యాఖ్యానాలను అనుగ్రహించారు. శ్రీ పిళ్లైలోకాచార్యులవారి తమ్ములు అయిన అ*ழ*గియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్ రచించిన ఆచార్య హృదయం అనే రహస్య గ్రంథానికి కూడా మణవాళ మహాముసులు తేనె, పాలు, కలకండ, అమృతం అనదగిన వ్యాఖ్యానాన్ని అనుగ్రహించారు. పెరియ వాచ్చాన్ పిళ్ళై విషయంలో తమకు ఉండే గౌరవం స్ఫురించేటట్లుగా, నాలాయిర దివ్య ప్రబంధాలలో, వారి వ్యాఖ్యానాలు లభించే ఏ ప్రబంధానికి కూడా తాము వ్యాఖ్యానాన్ని రచించకుండా, పెరియా*ழ*వార్ తిరుమొ*ழ*ికి వారి వ్యాఖ్యానం లోపించిన భాగానికి మాత్రమే తాము వ్యాఖ్యానాన్ని రచించారు. అంతేకాక, ఇరామానుశ నూ*ఱ*్*ఱ*న్దాది ప్రబంధానికి కూడా ప్రతిపదార్థరూపమైన ఉరైను అనుగ్రహించారు. తిరువాయ్ మొ*ழ*ి నూ*ఱ*్*ఱ*న్దాది, ఉపదేశ రత్తినమాలై, ఆర్తి ప్రబంధం, యతిరాజ వింశతి, దేవరాజ మంగళం అనే కృతులను అనుగ్రహించారు. నారాయర దివ్య ప్రబంధం వ్యాఖ్యానాలలోని ప్రమాణాలకు ఆకరాలను చూపుతూ, ప్రమాణత్తిరట్టును కూర్చారు.

తిరువాయ్ మొ*ழ*ి దివ్యప్రబంధంలో " తువళిల్ మా మణిమాడమ్" అనే దశకంలో నమ్మాళ్వారులు తమ గొప్పతనాన్ని తామే వ్యక్తం చేసుకున్న విధంగా, మణవాళ మహాముసులు కూడా తామే తమ గొప్పతనాన్ని ఆర్తి ప్రబంధంలో—

తెన్నరంగమ్ శీరరుళుక్కు ఇలక్కాగ ప్పెఱ్ఱోమ్
దేవనుక్కై తిరుప్పతియై ఇరుప్పాక ప్పెఱ్ఱోమ్
మన్నియ శీర్ మాఱన్ కలై ఉణవాక ప్పెఱ్ఱోమ్
మదురకవి శొఱ్పడియే నిలైయాగ ప్పెఱ్ఱోమ్
మున్నవరామ్ నమ్ గురవర్ మొ*ழ*ికళ్ ఉళ్ళ ప్పెఱ్ఱోమ్
ము*ழ*ుదు నమక్కవై పొ*ழ*ుదు పోక్కాగ ప్పెఱ్ఱోమ్
పిన్నై ఒన్ఱుదనిల్ నెంజు పేరామల్ ప్పెఱ్ఱోమ్
పిఱర్ మినుక్కుమ్ పొఱామై ఇల్లా ప్పెరుమైయుమ్ ప్పెఱ్ఱోమే

శ్రీరంగనాథుని దివ్యమైన కరుణకు పాత్రం అయినాము. ఆ భగవానుడు నివసించే క్షేత్రంలో నిత్యనివాసంగా ఉండగలిగాము. గొప్ప కీర్తిని కలిగిన నమ్మాళ్వారుల ప్రబంధాలనే శాస్త్రాలను ఆహారంగా పొందాము. మధుర కవులు తెలిపిన చరమ పర్వనిష్టను పొందగలిగాము. మన పూర్వాచార్యులు అనుగ్రహించిన సూక్తులను అనుసంధానం చేసుకోగలిగాము. అవే మనకు కాలక్షేపంగా పొందినవారం అయ్యాము. వాటికంటే అన్యమైన విషయాలలో మనసు పోకుండా ఉండే స్థితిని పొందాము. ఇతరుల అభివృద్ధిని చూసి అసూయ పడకుండా ఉండే గొప్పతనాన్ని కూడా, ఆహా!, పొందాము కదా!)
అని అంటూ తెలియజేశారు. ఈ పాశురమే మనకు నిత్యం అనుసంధించదగినది.

ఆళ్వార్ కళ్ వాழ అరంగనగర్ వాழ
శడకోపన్ తంద తమిழ నూల్ వాழ – కడల్ శూழన్ద
మన్నులగమ్ వాழ మణవాళ మామునియే!
ఇన్నుమొరు నూఱ్ఱాణ్డిరుమ్.

దివ్య సూరులు వర్ధిల్లేటట్లు, శ్రీరంగ క్షేత్రం వర్ధిల్లేటట్లు, నమ్మాళ్వారులు అనుగ్రహించిన తిరువాయ్ మొழி అనే దివ్యశాస్త్రం వర్ధిల్లేటట్లు, సముద్రాన్ని చుట్టూ కలిగిన ఈ భూమండలం వర్ధిల్లేటట్లు, ఓ మణవాళ మహాముని!, ఇంకా మీరు ఒక నూరు సంవత్సరాలు వేంచేసి ఉండాలి.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## శ్రీశైలేశదయాపాత్రం వైభవమ్

(మహావిద్వాన్, కాంచి ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్యస్వామివారి ద్రావిడవ్యాసం ఆధారంగా)

అల్పిశి మాసం మూలనక్షత్రంలో అవతరించిన ఈ ఆచార్యసార్వభౌముల అమృతం కంటే భోగ్యమైన మహిమను ఈ నాడు మనం కొత్తగా ఏమని చెప్పగలం? ఎన్ని పర్యాయాలు చెప్పినప్పటికీ "అప్పొళ్ళుదైక్కు అప్పొళ్ళుదు ఎన్నారా అముదమే" (ఎప్పటికప్పుడు నిత్య నూతనంగా భాసించే, ఎంత అనుభవించినా తృప్తిని కలిగించని నా అమృతం) అనే విధంగా ఉండేది, వీరి మహిమ. భగవద్రామానుజులు తమ అవతారంలో శేషించిన కార్యాలను నెరవేర్చడం కోసమే మళ్లీ వారు ఈ విధంగా శ్రీ మణవాళ మహామునుల రూపంలో ఒక అద్వితీయమైన రూపాన్ని ధరించడం జరిగింది. ఇంచుమించుగా వ్యాఖ్యాన గ్రంథాలను అనుగ్రహించడంలోనే ఈ రెండు అవతారాలలోనూ ముఖ్యదృష్టి. అత్యుక్తి, అతిశయోక్తి అనే రీతిలోని వచన వ్యక్తులను కలలో కూడా తెలియకపోవడం అనేది ఈ రెండు అవతారాలకు అసాధారణమైన విషయం. మాయను చేయడం, బ్రాంతిని కలిగించడం, అర్థాలను బలాత్కారంగా చెప్పడం మొదలైన దోషాలకు కొంచెం కూడా అవకాశం ఇవ్వకుండా, స్పష్టంగా సదర్థాలు స్ఫురించే దివ్యసూక్తులను అనుగ్రహించే సామర్థ్యం అనేది ఈ రెండు అవతారాలలో సమంగా గోచరించే విషయం.

శ్రీ పిళ్లైలోకాచార్యులవారికి పరమ కారుణికులు అనే ప్రసిద్ధి ఉన్నది. శ్రీ మణవాళమహా మునులు అవతరించి ఉండకపోతే వారి పరమకారుణికత్వం అడవిలో కాసిన వెన్నెలవలె ఎవరికి తెలియకుండా, అందకుండా వ్యర్థమై ఉండేది. అది ఈ లోకంలో స్పష్టంగా వ్యక్తమై ఉండి ఉండదు. శ్రీ పిళ్లైలోకాచార్యులవారు అనుగ్రహించిన అష్టాదశరహస్యాలు అనే 18 గ్రంథాలలో చాలా గొప్పవి అయిన ముముక్షుప్పడి, తత్త్వత్రయం, శ్రీవచన భూషణం అనే మూడు గ్రంథాలకు వీరి వ్యాఖ్యానాలు

అవతరించక పోయినట్లయితే, ఈ విశాలమైన ప్రపంచం అంతా అజ్ఞానమయమై ఉండి ఉండేది. సందేహమే లేదు.

వీరికి "విశదవాక్ శిఖామణి" అనే ఒక బిరుదం ప్రసిద్ధంగా వ్యవహరింపబడుతున్నది. ఈ బిరుదాన్ని మొట్టమొదటగా సమర్పించిన మహానుభావులు ఎవరో తెలియదు కానీ, మర్మాన్ని తెలిసి సమర్పించిన ఆ బిరుదు ఈ ఆచార్య శిఖామణులు ఒక్కరికే తగినది. "నివురు కప్పిన నిప్పు" అనే విధంగా ఉండే ఈ ఆచార్యుల సూక్తివలె ఈ లోకంలో ఇంతవరకు ఎక్కడా ఎవరి సూక్తి గోచరించలేదు—అని అంటే, ఇక మీదట ఎక్కడ మనకు గోచరిస్తుంది కనుక! వీరి దివ్య మంగళ విగ్రహం, మనసు అనేవి సత్వగుణం ఒకటే మూర్తి భవించినట్లుగా ఉన్నవి—అనేది వీరి రూపంలో, వాక్కులలో ప్రత్యక్షరంలోను మనకు గోచరిస్తుంది. సకల శాస్త్రార్థాలనూ చాలా అందంగా తనలో పొదువుకొని, ప్రత్యగ్రకుసుమంవలె అపూర్వమైన, అందమైన అర్థాలు పరిమళించేటట్లుగా, వీరి శ్రీసూక్తులు ఏ దోషాలు లేకుండా అమరి ఉండే అందం ఆహా! ఏమి! ఏమి! అని మన మనసు ఉబ్బితబిబ్బు అవుతుంది, అంతే. విషయ విమర్శన శక్తి, నిరూపణ నైపుణ్యం— అనే ఈ విధంగా చెప్పే రీతిలోని సామర్థ్యం అంతా చాలా ఆశ్చర్యకరమైన రీతిలో వీరి వ్యాఖ్యానశీసూక్తులలో మనకు గోచరిస్తుంది.

పలు మాటలను పలికి ఏమి ప్రయోజనం? సారంగా ఒక్క మాటను చెప్పి ముగిస్తాను. " అబ్ధిః లంఘిత ఏవ వానరభట్టైః———" అని అంటూ మురారి అనే ఒక మహాకవి అంటాడు. వానరవీరులు సముద్రాన్ని దాటి ఆవలి వైపుకు వెళ్ళినప్పటికీ, ఆ సముద్రంలోని లోతు ఎంతటిదో వారెవ్వరూ తెలిసినవారు కారు. ఆ సముద్రంలో అట్ట అడుగు వరకు మునిగిన మందర పర్వతం ఒక్కటే దాని లోతును పూర్తిగా తెలిసినది —అనేది ఈ శ్లోకంలోని తాత్పర్యం. మహా జ్ఞాతలు అని పేరు పడిన మిగిలినవారు అందరూ వానరవీరుల స్థానంలో, మణవాళ మహామునులు ఒక్కరే మందర పర్వతం స్థానంలో భావించదగినవారు. ఆచార్య నామానికి శ్రీవరవరమునులు ఒక్కరే

లక్ష్యమైనవారు– అని, సూక్తి, శ్రీసూక్తి, దివ్య సూక్తి, దివ్యశ్రీసూక్తి –అని ఈ విధంగా చెప్పే పదాలు అన్నీ శ్రీవరవరమునుల వాక్కులకే లక్ష్యంగా గ్రహించదగినవి అని అనేది నిష్పక్షపాతంగా చెప్పే పెద్దల సిద్ధాంతం.

ఋజువైన, అందమైన ద్రావిడవేదం తెలిసినవారి మనసు తేటపడి ఆనందించేటట్లుగాను, శ్రీ పిళ్లై లోకాచార్యులవారు అనుగ్రహించిన దివ్య గ్రంథాలు ప్రకాశం పొందేటట్లుగాను, మందమతులతో నిండిన ఈ భూమిలోని మానవులు వైకుంఠాన్ని పొందేటట్లుగాను, ఏ దోషం లేని జ్ఞానులు ఆశ్రయించే భగవద్రామానుజుల ఉజ్జీవనం అంకురించే విధంగాను, సుగంధాన్ని కలిగిన పూలతో నిండిన తోటలను చుట్టూ కలిగిన అళ్వార్ తిరునగరిలోని నమ్మాళ్వారుల శాస్త్రాలు అనదగిన దివ్య ప్రబంధాలు ప్రకాశించేటట్లుగాను ఈ భూమండలంలోకి వచ్చి ఉదయించిన పరమాచార్యులు కదా, వీరు. మన ఆళ్వారులు, పూర్వాచార్యులు అందరూ కలిసి సమీకృతమై, అవతరించిన అవతారమైన ఈ వరవరమునుల తనియన్ శ్లోకాన్ని, వా*ళ్ళి* తిరునామాలను ప్రతి దినం ఈ భరత ఖండం అంతా అనుసంధించి, ఉజ్జీవనాన్ని పొందుతున్నది.

తిరువాయ్ మొ*ళ్ళి* దివ్యప్రబంధానికి గొప్ప వ్యాఖ్యానంగా అవతరించిన ఈడు ముప్పత్తారాయరప్పడిలోని విశేషార్థాలను ఈ మహాచార్యుల ముఖంనుండి వినాలని ఆశపడిన శ్రీరంగనాధుడు "తన ఆలయంలో గరుడ మండపంలో వేంచేసి ఉండి అనుగ్రహించాలి" అని వీరిని ఆజ్ఞాపించాడు. ఈ మహా చార్యులు కూడా ఆ విధంగానే ఒక సంవత్సర కాలం భగవద్విషయ ప్రవచనం చేయగా, ఆ ప్రవచనం పూర్తి అయిన నాడు శ్రీరంగనాథుడు ఒక చిన్న బాలుని రూపంలో గోష్ఠిలోకి వచ్చి నిలచి,

"శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్,
యతీంద్ర ప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్. "

అనే ఒక దివ్యమైన శ్లోకాన్ని చేతులను జోడించి నిలచి, విజ్ఞాపన చేశాడు— అనే వృత్తాంతం ప్రసిద్ధం. ఈ శ్లోకంలో కూర్పబడిన పదాల అందాన్ని పరిశీలిస్తే, ఇది దివ్య వాక్కు తప్ప, మానవవచనం కానే కాదు —అనేది అందరూ ఏకగ్రీవంగా అంగీకరించే విషయం. ఇందులోని అర్థసౌందర్యం సంగ్రహంగా విజ్ఞాపన చేయబడుతున్నది.

### 1) శ్రీశైలేశ దయా పాత్రమ్

“మా ముని వేళ్వియై క్కాత్తు అవపిరదమ్ ఆట్టియ అయోత్తి ఎమ్మరశే! అరంగత్తమ్మా!” (మహర్షి అయిన విశ్వామిత్రుని యాగాన్ని రక్షించి అవబృథాన్ని చేయించిన అయోధ్యా నగరానికి ప్రభువైన శ్రీ రంగనాథా!) అని శ్రీ రంగనాథుడే విభవరూపంలో శ్రీరాముడుగా అవతరించినపుడు, ఆ అవతారంలో శైలేశదయాపాత్రాన్ని ఆశ్రయించినా, శ్రీశైలేశదయా పాత్రాన్ని ఆశ్రయించ లేకపోయాడు. ఇక్కడ, శైలేశదయాపాత్రమంటే— సుగ్రీవుడు, ఈ పదం చేత అతని వ్యావృత్తి చెప్పబడుతున్నది. శ్రీరామాయణం కిష్కింధా కాండలోని 11వ సర్గలో, సుగ్రీవ మహారాజు శైలేశదయాపాత్రభూతుడు అయ్యాడు— అనే విషయాన్ని తెలియాలి. అది ఏ విధంగా అంటే— ఇక్కడ శైలం అంటే— ఋష్యమూక పర్వతం, దానికి ప్రభువు మతంగముని, ఆ ముని దయకు సుగ్రీవుడు పాత్రం అయ్యాడుకదా! దుందుభితో యుద్ధం చేసిన వాలి అతనిని వధించి, అతని మృతశరీరాన్ని పైకెత్తి విసరి కొట్టాడు. ఆ మృతశరీరం నోటి నుండి రాలిన రక్తబిందువులు గాలి వేగానికి మతంగముని ఆశ్రమంలో పడ్డాయి. దానిని చూచి కోపించిన ఆ ముని ఆ దుష్కార్యాన్ని చేసినవాడు వాలి అని తన యోగనేత్రం ద్వారా తెలిసికొని, తన ఆశ్రమంలోకి అతడు వస్తే అతని తల బద్దలవుతుందని శాపం పెట్టాడు. ఆ కారణంగా సుగ్రీవుడు ఆ మతంగముని అనుగ్రహానికి పాత్రమై, వాలినుండి రక్షణను పొందాడు. ఈ విధంగా సుగ్రీవుడు శైలేశ దయాపాత్రం అయ్యాడు— అని అనడం తగినది. సీతను అన్వేషించడం కోసం శ్రీరాముడు సుగ్రీవుని శరణు పొందినా, తరువాత ఎటువంటి మనస్తాపం లేకుండా ఉండాలి కదా. కాని, సుగ్రీవుడు భోగలాలసుడై, నిర్దేశించిన కాలంలో సీతాన్వేషణ కోసం ప్రయత్నం చేయలేదు. అప్పుడు శ్రీరాముడు

లక్ష్మణుని పంపించి, తీవ్రమైన దండనను విధిస్తానని తాను భావించిన విషయాన్ని సుగ్రీవునకు వ్యక్తం చేశాడు. అందుచేత శైలేశ దయాపాత్రుడైన సుగ్రీవుని విషయంలో శ్రీరాముడు ముందు శరణాగతి చేసినా, తరువాత, ఆ విధంగా శరణాగతి చేసినందులకు విచారించవలసి వచ్చింది. ఆ కొరత తీరేటట్లుగా ఇప్పుడు శ్రీశైల దయాపాత్రభూతులైన, అంటే, తిరువాయ్ మొ*ழி* ప్పిళ్ళై అనుగ్రహానికి పాత్రమైన శ్రీవరవరమునులను ఆశ్రయించి, నేను ఇప్పుడు ఉజ్జీవించాను– అని శ్రీ రంగనాథుడు తెలిపినట్లయినది. తిరువాయ్ మొ*ழி*ప్పిళ్ళై భవ్య కరుణకు శ్రీవరవరమునులు పాత్రం అయినారు– అని ఇక్కడ తాత్పర్యం.

## 2) ధీభక్త్యాది గుణార్ణవమ్

శ్రీరాముడై అవతరించిన ఆ కాలంలో సుగ్రీవుని శరణాగతి చేసినట్లుగానే, సముద్రుని విషయంలో కూడా భగవానుడు శరణాగతి చేసిన విషయం యుద్ధకాండలో ప్రసిద్ధమైన వృత్తాంతం. " సముద్రం రాఘవో రాజా శరణం గంతు మర్హతి" అనే విభీషణుని వచనానుసారం శ్రీరాముడు లవణార్ణవాన్ని శరణాగతి చేసినా, తరువాత అతృప్తిని, విచారాన్ని పొందిన సంగతి సుప్రసిద్ధం. " సాగరం శోషయిష్యామి" అని అది నిగ్రహంలోకి కదా, పర్యవసించింది. ఆ విధంగా కలిగిన కొరత తీరేటట్లు ఆ లవణార్ణవాన్ని విడచిపెట్టి, ధీభక్త్యాది గుణార్ణవాన్ని ఆశ్రయించి, తరించాను –అని శ్రీరంగనాథుడు చెప్పినట్లయినది. జ్ఞాన భక్తి వైరాగ్యాలకు సముద్రంవంటివారు వరవరములు– అని దీని తాత్పర్యం.

## 3) యతీంద్ర ప్రవణమ్

యతీంద్రులంటే భగవద్రామానుజులు. " అప్పనుక్కు చ్చంగా*ழி* అళిత్తరుళుమ్ పెరుమాళ్" (శ్రీ వేంకటేశ్వరునకు శంఖచక్రప్రదానం చేసిన స్వామి) అని కీర్తింపబడే భగవద్రామానుజులు గోవింద భట్టర్, కూరేశులు మొదలైనవారికి శంఖ చక్ర ప్రదానం చేసినట్లే, శ్రీవేంకటేశ్వరునకు కూడా శంఖచక్ర ప్రదానాన్ని చేసిన ఇతిహాసం ప్రసిద్ధం.

కనుక, " మంది పాయ్ వడవేంగడమామలై వానవర్ కళ్ శంది శెయ్య నిన్టాన్ అరంగత్తరవినణైయాన్ " (ఆడ వానరాలు సంచరించే వేంకటాచలంపై ఉండే శ్రీవేంకటేశ్వరునకు నిత్యసూరులు ఆరాధనను చేస్తున్నారు, ఆ వేంకటేశ్వరుడే శ్రీరంగంలో శ్రీరంగనాథుడుగా ఆదిశేషుడనే పడుకపై పరుండి ఉన్నాడు) అని చెప్పబడే శ్రీ రంగనాథుడు శ్రీ వేంకటేశ్వరుని రూపమే కనుక, ఆ స్వామి యతీంద్రుల విషయంలో కూడా శిష్యవృత్తిని చేసినట్లు తెలుస్తున్నది కదా. ఇరామానుశ నూ*ఱ్ఱ*న్దాది ప్రబంధంలోని " తన్నై యు*ఱ్ఱు* ఆట్చెయ్యుమ్ తన్మైయినోర్" (తనను ఆశ్రయించినవారు తప్ప, తనను ఆశ్రయించినవారిని సేవించేసేవారు లేరని తెలిసి, భగవద్రామానుజులు, నన్ను ముందుగా తమ శిష్యులైన కూరేశులకు శిష్యునిగా చేశారు) అనే పాశురాన్ని ఆలకించిన తరువాత, యతీంద్రుల వద్ద శిష్యవృత్తిని చేయడం కంటే, యతీంద్ర ప్రవణుల విషయంలో శిష్యవృత్తిని చేయడమే గొప్పది– అని ఆ స్వామికి తోచినందున, అతడు ఇప్పుడు యతీంద్రప్రవణులను ఆశ్రయించడం చాలా యుక్తం.

## 4) రమ్యజామాతరం మునిమ్

శ్రీరామావతారంలో విశ్వాముని దగ్గర, శ్రీకృష్ణావతారంలో సాందీపనిముని దగ్గర భగవానుడు శిష్యవృత్తిని చేసినా, వారి విషయంలో సంసారిత్వపూర్తినే చూచి, మనసులో నొచ్చుకున్నవాడు అయినందున, ఆ కొరత తీరేటట్లు విరక్తాగ్రేసరులైన శ్రీవరవరములను ఆశ్రయించాడు– అని భావం.

విశ్వామిత్ర ముని సంసారిత్వం ఆ మహర్షి చరిత్రలో ప్రసిద్ధం. సాందీపముని సంసారిత్వం ఏనాడో మరణించిన తన కుమారుని తిరిగి బతికించాలి–అని అతడు కోరినందున వ్యక్తమైనది.

ఈ విధంగా ఉండే అర్థవిశేషాలకు స్ఫుటంగా ప్రతీతి కలిగేటట్లుగా శబ్దసన్నివేశంతో కూడిన ఈ తనియన్ శ్లోకంతో లోకాలను ఉజ్జీవింపజేసిన శ్రీరంగనాథునకు ఆచార్యులు అయిన శ్రీవరవరములను మనం అనుదినం ధ్యానించి, మనసులో ఆనందిద్దాం.

## సత్కార్య వాదం – ప్రణవం–శ్రీవరవరమునుల తనియన్

మన విశిష్టాద్వైత సంప్రదాయం, పూర్వాచార్యపరంపర ఆదినే అంతంగా కలిగినవి. మన సంప్రదాయం ప్రకారం ఏది ఆది అని చెప్పబడుతున్నదో, అదే అంతంగా చెప్పబడుతున్నది. ఏది అంతమని చెప్పబడుతున్నదో, అదే ఆదిగా చెప్పబడుతున్నది. ఈ విషయం గీతాచార్యుడు గీతలో పలికిన ఒక వచనం వల్ల స్పష్టమవుతున్నది. "జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ" (పుట్టినవానికి మరణం ధ్రువంకదా, మరణించినవానికి కూడా జన్మ ధ్రువం) అనేది ఆ గీతావాక్యం. ఈ వాక్యాన్ని వివరించే భగవద్రామానుజులు, ఇది సత్కార్య వాదాన్ని తెలియజేస్తున్నదని ఈ విధంగా వివరించారు. 'ఒక కుమ్మరివాడు మట్టి ముద్దను తీసుకొని వచ్చి, దానిని చక్రంలో పెట్టి తిప్పుతున్నాడు. ఆ మన్నును రెండు చిప్పలుగా తయారుచేస్తున్నాడు. ఆ చిప్పలను రెండిటిని అతికి ఒక వస్తువుగా చేస్తున్నాడు. అప్పుడు దానికి ఆ కుండ అని పేరు. అది కడుపును, మూతిని కలిగి, నీటిని ధరించే ఒక ఆకారాన్ని పొందుతున్నది. కొంతకాలం అయిన తరువాత ఆ కుండా పగిలిపోయి, రెండు చిప్పలుగా అవుతున్నది. తర్వాత ఆ రెండు చిప్పలు ముక్కలుగా అవుతున్నవి. ఆ ముక్కలు ఇంకా చితికి చూర్ణమై మట్టి ముద్దగా మారుతున్నవి. ఈ దశలను క్రమంగా గమనిస్తే, మొదట ఉన్న మట్టిముద్దే తరవాత రెండు చిప్పలుగా, తరువాత కుండగా, తరువాత మళ్లీ రెండు చిప్పలుగా, తరవాత మళ్ళీ మట్టి ముద్దగ అయినది. దీనినే పూర్వాచార్యులు, మట్టి ముద్దగా ఉంటే ఏమి? రెండు చిప్పలు అయితే ఏమి? అవి కుండగా మారితే ఏమి? అది ముక్కలుగా అయితే ఏమి? మళ్లీ అవి మట్టిముద్దగా మారితే ఏమి? ఎపుడు ఏ దశలో మారినా, మట్టి ముద్ద మట్టిముద్దే కదా - అని అన్నారు. ఇక్కడ ఆయా దశలలో మార్పే తప్ప, వస్తువుకు మార్పు లేదు కదా! అంతటా అన్ని దశలలో వస్తువు ఒకటే కదా! ఇదే సత్కార్యవాదానికి మంచి ఉదాహరణ.

ఈ విధంగా గ్రహించకుండా, ఇంతకు ముందు లేని ఒక వస్తువు కొత్తగా పుడుతున్నది - అని వైశేషిక మతానికి చెందినవారు వాదించారు. వీరి వాదానికి అసత్కార్యవాదం అని పేరు. కానీ, ఈ వాదాన్ని వేదం ఖండిస్తున్నది, సత్కార్య

వాదాన్ని స్థాపిస్తున్నది - అని భగవద్రామానుజులు వేదార్థ సంగ్రహం మొదలైన గ్రంథాలలో "యథా సౌమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్, వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్" (నాయనా! ఒకే ఒక్క మట్టి ముద్దను తెలుసుకోవడం ద్వారా దానినుండి పుట్టిన వికారాలు అన్నీ తెలిసినట్లుగా అవుతాయి. నామాలలో తేడా తప్ప, అంతా మట్టి అనేదే నిజం) అని మొదలైన శృతివాక్యాల ద్వారా నిరూపించారు.

"ముందు నూలు ఉన్నది. దానిని సాలివాడు ముందు, వెనుక కలిపి జతచేసి, దానిని వస్త్రంగా తయారు చేస్తున్నాడు. అందువల్ల ఇంతకుముందు లేని వస్త్రం అనే వస్తువు కొత్తగా పుడుతున్నది. ఆ విధంగానే, ముందు మట్టిముద్ద ఉన్నది. దానిని కుమ్మరివాడు కుండగా తయారు చేస్తున్నాడు. ఈ విధంగా ఇంతకు ముందు లేని కుండ అనే వస్తువు పుడుతున్నది. అందుచేత, ఇంతకుముందు లేని వస్తువే కొత్తగా పుడుతున్నది" - అని వైశేషికుడు అసత్కార్య వాదాన్ని చేశాడు.

ఈ అసత్కార్య వాదాన్ని శ్రీరామానుజులు ఖండించారు. అసత్కార్య వాదాన్ని చేసే వైశేషికుని, సాలెవాని ఇంటికి తీసుకుని పోయి, అతడు వస్త్రాన్ని నేసే రీతిని చూపించారు. కుమ్మరివాని దగ్గరకు తీసుకుని పోయి, అతడు కుండను చేసే రీతిని చూపించారు. అప్పుడు అతనిని "నీవు సాలెవాడు వస్త్రాన్ని, కుమ్మరివాడు కుండను చేయడం చూచావు కదా. మొదట ఉన్న నూలే కదా వస్త్రం అవుతున్నది. కొత్తగా ఏమి పుడుతున్నది? మొదట ఉన్న మన్నే కదా కుండ అవుతున్నది. కొత్తగా ఏమి పుడుతున్నది? నీ కళ్ళతో నీవు బాగా చూడు. ఎన్నిసార్లు అయినా చూడు, ఎంత నిపుణంగా అయినా చూడు. ఏమి కనబడుతున్నది? ఏమి తెలుస్తున్నది? ముందు ఉన్న నూలే కదా చివర కూడా ఉన్నది. ముందు ఉన్న మన్నేకదా చివరికి కూడా ఉన్నది. ఇక్కడ కేవలం ఒకే వస్తువుకు దశల మార్పు తప్ప, కొత్తగా ఏ వస్తువు పుట్టలేదు కదా, ముందు ఉండే అవస్థ మట్టిముద్దగా ఉండే దశ. తర్వాత కలిగిన దశ కుండగా ఉండే దశ. ఆ విధంగానే, మొదట ఉండే దశ కుండగా ఉన్న దశ, ఆ తరువాత ఏర్పడిన దశ మట్టిముద్దగా ఉండే దశ. ఈ విధంగా దశలలో మార్పు తప్ప, వస్తువు

అన్ని అవస్థలలోను ఒకటే కదా, తేడా ఏమి ఉన్నది? ఎంతసేపు చూసినా మన్ను మన్నే. ఎంతసేపు చూసినా నూలు నూలే. దశలలో భేదం తప్ప వస్తువులో భేదం లేదు కదా" అని అన్నారు.

మొదట ఉన్న మట్టిముద్ద అనే కారణమే కుండ అనే కార్యం అవుతున్నది. ఈ విధంగా కారణమే కార్యం. కారణబ్రహ్మమే కార్య బ్రహ్మం. కార్య కారణాలు రెండూ ఒకటే. ఇదే విశిష్టాద్వైత సిద్ధాంతం. ఒకే వస్తువుకు ముందు ఉండే దశకు మార్పు కలిగితే కార్యమనే అనంతరావస్థ అవుతున్నది. ఆ అనంతరావస్థకు మార్పు కలిగితే కారణమనే మొదటి అవస్థ కలుగుతున్నది. ఈ విధంగా ముందు అవస్థకు మార్పు కలిగితే తరువాతి అవస్థకు ఉత్పత్తి. తరువాతి అవస్థకు నాశనం కలిగితే దానికి ముందు అవస్థకు ఉత్పత్తి. ముందు అవస్థ మట్టిముద్దగా ఉన్న దశ. తర్వాత ఉన్న దశ కుండగా అయిన దశ. ఆ విధంగానే మొదటి ఉన్న దశ కుండగా ఉండే దశ, తరువాత మారిన దశ మట్టి ముద్దగా అయిన దశ. అందుచేత, కాలానుగుణంగా దశలలో మార్పు తప్ప, వస్తువులో మార్పు లేదు. ఈ విధమైన ఆద్యంతాల ఐక్యాన్ని తెలుపుతున్నది, సత్కార్య వాదం. భగవానుని అంతాది స్వరూపాన్ని తెలుపుతున్నది. అంతా ది అంటే అంతమే ఆదిగా కలిగినది అని కదా అర్థం.

భగవద్వైభవాన్ని తెలిపే వేదాలు కూడా అంతాదులే. వేదం ప్రారంభంలో, చివర కూడా ఓంకారం ఉచ్చరించబడుతున్నది"ఓమితి బ్రహ్మ" అనే విధంగా భగవంతుడు ఓంకార స్వరూపుడు. "ఓంకార ప్రభవో వేదాః" అని వేదాలన్నీ ఓంకారంనుండి పుడుతున్నాయి. సమస్త శబ్దజాలం వేదాలనుండి పుడుతున్నది. ఈ విధంగా ప్రణవం వేదాలకు, సమస్త శబ్దజాలానికి మూలం. మళ్ళీ ఈ వేదాలు, శబ్దజాలం అంతా ప్రణవంలోనే లీనం అవుతున్నాయి. అందుచేత ఓంకారమే వేదాలకు, శబ్దజాలానికి ఆది, అంతం కూడా.

భగవద్రామానుజ సంప్రదాయం ఉభయ వేదాంత సంప్రదాయం. ఉభయ వేదాంతాలు అంటే సంస్కృత వేదాంతం, ద్రావిడ వేదాంతం అనేవి. సంస్కృత వేదం అంతాది అయినట్లే ద్రవిడవేదంకూడా అంతాదియే.

ఆరంభంలోను చివర కూడా శ్రీవరవరమునుల తనియన్ అనుసంధింపబడుతున్నది. శ్రీరంగంలో శ్రీరంగనాథ స్వామి స్వయంగా ఆశపడి, ఒక సంవత్సర కాలం తన ఆలయంలో అన్నీ ఉత్సవాలను నిలుపు చేసి, విశదవాక్ శిఖామణి అయిన మణవాళ మహామునిముఖంగా తిరువాయ్ మొழி దివ్యప్రబంధ వ్యాఖ్యానాలలో చాలా గొప్పది అయిన ఈడు వ్యాఖ్యానాన్ని విన్నాడు. ఇంత కాలంగా తాను వరవరమునుల సన్నిధిలో ఈడు కాలక్షేపాన్ని విసినందున తనను వారికి శిష్యునిగా సంభావించుకొని, ఆ మహాచార్యులకు ఒక తనియన్ శ్లోకాన్ని గురుదక్షిణగా సమర్పించుకోవాలి అని భావించాడు. ప్రణవంవలె మహావైభవాన్ని కల "శ్రీశైలేశ దయాపాత్రమ్" ఇత్యాది శ్లోకాన్ని వరవరమునుల ప్రవచనం పూర్తి అయ్యే సందర్భంలో, గోష్ఠిలో నాలుగేళ్ల చిన్న కుర్రవాడుగా ప్రత్యక్షమై, విన్నపించాడు. అందులో ఉండే ఒక్కొక్క పాదాన్ని ఒక్కొక్క దిక్కు వైపు తిరిగి పలికి, చటుక్కున మాయమయ్యాడు. తరువాత అర్చక ముఖంగా "వేదాన్ని అనుసంధించేటప్పుడు ఏ విధంగా మొదట, చివర ప్రణవం నియతంగా ఉచ్చరింపబడుతున్నదో, ఆ విధంగానే ఈ వైష్ణవ గృహాలలో అంతటా భగవదారాధనలో దివ్యప్రబంధాల అనుసంధానం ప్రారంభంలో, చివర ఈ శ్లోకం అనుసంధింపబడాలని నియమించాడు. ఈ క్రమం ఈ నాటికీ అనుసరింపబడుతున్నది. ఈ విధంగా ఆదియే అంతంగా భాసిస్తున్నది. ఇటువంటి సన్నివేశాన్నే తెన్నాచార్యసంప్రదాయ గురుపరంపర కలిగి ఉన్నది. ఆ సంప్రదాయంలో పూర్వాచార్యగురుపరంపర శ్రీవరవరమునులతో ప్రారంభమై, వారితోనే పూర్తి కావడం గమనించాలి. గురుపరంపరకు ఆద్యుడైన శ్రీరంగనాథునకు కూడా ఆచార్యులు కదా, శ్రీమణవాళ మహామునులు.

ప్రణవసమానం జయతాత్
శ్రీశైలేశేతిపద్య మనవరతమ్.
ద్రావిడవేదాధ్యయన
స్యాదౌ చాంతే యదుచ్యతే నియతమ్.

# యతిరాజవింశతి

శ్రీవైష్ణవ సిద్ధాంతాన్ని ప్రచారం చేసిన మన పూర్వాచార్య పరంపరలో చివరివారు– శ్రీమణవాళ మహామునులు. వీరి జ్ఞానభక్తి వైరాగ్యాలు వాచామగోచరాలు. సదాచార్యులైన తిరువాయ్ మొழி ప్పిళ్ళై అనుగ్రహం వల్ల తత్వహిత పురుషార్థాలను యథాతథంగా గ్రహించినవారు, వీరు. అంటే, చరమ పర్వమైన ఆచార్యవిషయమే ఉత్తమమైనదని తెలిసికొన్నారు. దానికి తగినట్లు స్వరూపానురూపమైన ఉపాయాన్ని పరిగ్రహించారు. స్వామి భగవద్రామానుజవలె ఆచార్యత్వ పూర్తిని కలిగినవారు– అని, వారి సంబంధంచేతనే వారికి ముందున్న ఆచార్యులు, వారికి తరువాత ఉన్న ఆచార్యులు అందరూ ఉజ్జీవనాన్ని పొందారని సంశయ విపర్యయరహితంగా (ఏ సందేహం లేకుండానూ, విపరీతార్థం లేకుండానూ) తెలిసికొని, తమ ఆచార్యరుచిపరిగృహీతమైన (తమ ఆచార్యులు ఆదరించిన) భగవద్రామానుజుల కైంకర్యమే గొప్పది– అని నిశ్చయం చేసికొన్నారు.

ఈ ఆచార్యులు, తమకు తరువాత జన్మించిన మనవంటివారికి ఉపాయంగా స్వతంత్ర గ్రంథాలను, వ్యాఖ్యాన గ్రంథాలను అనుగ్రహించారు. వాటిలో ఒకటి, యతిరాజ వింశతి అనే గ్రంథం. ఇది స్వతంత్రం గ్రంథం. ఇది భగవద్రామానుజులను శరణాగతి చేసే క్రమంలో ఉన్నది. ఈ ప్రబంధానికి గల వైలక్షణ్యాన్ని వీరి శిష్యులలో ఒకరైన ఎఱుంబి అప్పా అనేవారు " యః స్తుతిం యతిపతి ప్రసాదినీమ్" అనే తనియన్ శ్లోకంలో తెలియజేశారు.

ఈ తనియన్ శ్లోకం ఈ ప్రబంధంలోని గొప్పతనాన్ని తెలియజేస్తున్నది. "ఈ చేతనుని నేను కటాక్షించను" అని ఒకవేళ ఎవరిని అయినా చూచి, భగవద్రామానుజులు భావించినప్పటికీ, అతని ముఖం నుండి ఈ ప్రబంధం ఆలకించిన వెంటనే, అతని విషయంలో అనుగ్రహాన్ని చేయకుండా వారు ఉండలేరు– అనే రీతిలో ఈ ప్రబంధనం

చేస్తుంది– అని ఈ సూక్తిలోని భావం. శ్రీరంగామృతకవి కూడా (ఆముదనార్) ఇరామానుశ నూ*ఱ్ఱ*న్దాది అనే ప్రబంధంలో "శురక్కుమ్ తిరువు ముణర్వుమ్" అనే పాశురంలో ఇదే భావాన్ని తెలియజేశారుకదా.

“ప్రపన్న జనచాతకాంబుదమ్" అనేది ఈ స్తోత్రాన్ని అనుగ్రహించిన శ్రీ వరవరమునులు గొప్పతనాన్ని తెలియజేస్తున్నది. ప్రపన్నులు అనే చాతక పక్షులకు మణవాళ మహామునులు వర్షుకవలాహకంవంటివారు (వర్షాకాలంలో కురిసే స్వభావాన్ని కలిగిన మేఘంవంటివారు) – అని దీని అర్థం. భగవద్రామానుజుల కళ్యాణ గుణాలను తాము అనువదించి, వారి సంబంధులకు భోగ్యంగా ఉపదేశించేవారు– అని ఇక్కడ తాత్పర్యం. ఈ రెండూ కూడా మణవాళ మహామునుల గొప్పతనాన్ని తెలుపుతున్నవి– అని చెప్పవచ్చు.

ఈ ప్రబంధానికి శుద్ధసత్వం దొడ్డయాచార్యస్వామి, పిళ్లైలోకమ్ జీయర్, తిరుమ*ఴి*శై అణ్ణా అప్పంగార్ స్వామి (వాధూల వీరరాఘవాచార్య స్వామి) మొదలైన పూర్వాచార్యులు వ్యాఖ్యానాలను రచించారు. ఈ ప్రబంధంలో తెలియజేయబడిన విషయాలలోని సారాన్ని ఇక సంగ్రహంగా గమనిద్దాం.

ఇందులో, ముముక్షువులు తెలియవలసిన రహస్యాలు అయిన తిరుమంత్రం, ద్వయమంత్రం, చరమశ్లోకం అనే మూడింటిలో ఉండే అర్థవిశేషాలనే మణవాళ మహామునులు ఈ ప్రబంధంలో తెలియజేశారు. ఇంతే కాక, మూలమంత్రంలో మూడు పదాలు, మంత్రరత్నంలో ఆరు పదాలు, చరమ శ్లోకంలో 11 పదాలు ఉన్నందున, వాటికి తాత్పర్య రూపంగా ఆవిర్భవించినందున ఈ ప్రబంధంలో కూడా 20 శ్లోకాలు ఉన్నాయి –అని కొందరు పెద్దలు తెలియజేశారు. ప్రపన్న గాయత్రి అనబడే ఇరామానుశ నూ*ఱ్ఱ*న్దాది ప్రబంధానికి ఇది సంగ్రహం కనుక, ఇందులో కూడా ప్రతి శ్లోకంలోనూ

"యతిపతి, యతీంద్ర" అని మొదలైన శ్రీరామానుజుల నామాల అనుసంధానం గోచరిస్తుంది.

ప్రపత్తి శాస్త్రంలో "భగవంతుడే ఉపాయం" అని, "అతడే ఉపేయం" అని నిశ్చయింపబడుతున్నది. వాటి చరమసీమ చరమోపాయం, చరమోపేయం. అంటే, ఆచార్యుడే ఉపాయం అని, అతడే ఉపేయం— అని భావించడం. ప్రస్తుతంలో భగవద్రామానుజులు ఆచార్యత్వపూర్తిని కలిగినవారు కనుక, భగవద్రామానుజుల ఉపాయత్వ –ఉపేయత్వాలను ఇందులో మణవాళ మహాములు అనుసంధించారు.

ఉపాయానికి కావలసినది విషయపూర్తి. అపరాధ భూయస్త్వం, ఆకించన్యం, ఉపాయ ప్రార్థన— అనే ఇవి అన్నీ ఈ ప్రబంధంలో గోచరిస్తాయి.

మొదటి రెండు శ్లోకాలలతో తాము ఆశ్రయించే ఉపాయం అయిన భగవద్రామానుజులనే విషయంలోని పూర్తిని శ్రీమణవాళ మహామునులు విజ్ఞాపన చేశారు.

"ఉభాభ్యామేవ పక్షాభ్యాం యథా ఖే పక్షిణాం గతిః,
తథైవ జ్ఞానకర్మభ్యాం ప్రాప్యతే పురుషోత్తమః"

అని చెప్పబడిన విధంగా జ్ఞానం, అనుష్ఠానం అనే రెండు భగవంతుని పొందడానికి సాధనాలు అవుతున్నాయి— అని శాస్త్రం విధించింది. దాని ప్రకారం, మొదటి శ్లోకంలో భగవద్రామానుజుల జ్ఞానపూర్తిని తెలియజేసి, రెండవ శ్లోకంలో దానికి తగిన అనుష్ఠాన పూర్తిని కలవారువారు, వారు— అని మణవాళ మహామునులు ఈ ప్రబంధంలో తెలియజేశారు.

నమ్మాళ్వారులు శ్రీ చరణాలలో భగవద్రామానుజుల ప్రేమపౌష్కల్యం, స్వాభిమానంలో కలిగి ఉండేవారి దుఃఖాలను తీర్చడం, ఇష్టాన్ని అనుగ్రహించడం— అనే భగవద్రామానుజుల రక్షకత్వం చెప్పబడినవి. ఇవి అన్నీ జ్ఞానానుష్ఠానాలు కదా. ఆముదనార్ ఇరామానుశ నూ*ఱ్ఱ*న్దాది ప్రబంధంలో అనుసంధించిన అర్థాలనే వీరు కూడా మొదటి శ్లోకంలో అనుసంధించినందున, ఈ ప్రబంధం ప్రపన్న గాయత్రీ ప్రబంధానికి సంగ్రహరూపం— అనే విషయం సులభంగా తెలియవచ్చు.

అనుష్ఠాన విషయంలో తదీయశేషత్వపర్యంతమైన తచ్ఛేషత్వజ్ఞానానికి అనుగుణంగా (భగవంతునకు శేషంగా ఉండడం అనేది ఆ భగవంతుని భక్తులకు కూడా శేషంగా ఉండడం వరకు ఉండాలి— అనే జ్ఞానానికి తగినట్లు) సర్వత్రయకించిత్కారాన్ని (భగవత్ కైంకర్యం, భాగవత కైంకర్యం, ఆచార్యకైంకర్యం అనే మూడు దశలలోని కైంకర్యాలను) అనుసంధించారు. దానిని శ్రీరంగనాథుని శ్రీచరణాలలో వర్తించే హంసశ్రేష్ఠం అనే నమ్మాళ్వారుల శ్రీచరణ పద్మాలలోని బోగ్యతను జీవనంగా కలిగిన తుమ్మెద— అని, పెరియాళ్వారులు, తిరుమంగై ఆళ్వారులు అనే వీరి ముఖమండలాలు అనే తామరలను వికసింప జేసే సూర్యునివంటివారు, రామానుజులు— అని రసఘనంగా పలికారు. శిష్యాచార్యక్రమానికి చరమావధి అయిన కూరేశులకు ప్రాప్య ప్రాపకమై ఉండేవారు, శ్రీరామానుజులు— అని పలకడం ద్వారా తమ భక్తుల విషయంలో శ్రీ రామానుజులు ఉండే స్థితిని చూపించారు. ఇటువంటి జ్ఞానం, అనుష్ఠానం— అనే రెండిటినీ కలిగిన ప్రాప్తశేషి అయిన శ్రీ రామానుజుల విషయంలో మొదటి శ్లోకం ద్వారా "మూర్ధ్నా ప్రణమామి "అని కాయిక కైంకర్యాన్ని, రెండవ శ్లోకంలో "ఈడే" అని వాచికమైన వరివస్యను చేసి, వారి గుణపూర్తికి జితులై, శ్రీ మణవాళ మహామునులు ఈ స్తోత్రాన్ని చేస్తున్నారు.

తరువాత మూడవ, నాలుగవ, ఐదవ శ్లోకాలలో ప్రాప్యప్రార్థనను చేశారు. వాటిలో మొదటి శ్లోకం ద్వారా, అంటే, మూడవ శ్లోకం ద్వారా మనస్సు, వాక్కు, శరీరం— అనే

మూడు కరణాలతో భగవద్రామానుజుల శ్రీ చరణాలనే ఉపాయంగా, ఉపేయంగా నిశ్చయించుకున్న పూర్వాచార్యుల శ్రీ చరణాలను తాము వదిలి పెట్టకుండా నిరంతరం భావించగలగాలి— అని ప్రార్థించారు. ప్రేమ తల ఎత్తితే, క్రమాన్ని చూడనీయదు. తమ కరణాల ఆసక్తిలోని తొందరపాటు చేత మనఃపూర్వకంగా వచ్చే క్రమం తారుమారు కాగా, వాచా, మనసా, వపుషా —అని అంటున్నారు. వాఙ్మనఃకాయైః "అని మూడిటినీ కలిపి చెప్పకుండా, వాటిని వేరు వేరుగా నిర్దేశించి చెప్పడంచేత, ఏదో ఒక్క కరణంతో చేసిన సమాశ్రయణం కూడా ఫలిస్తుంది— అనేది తెలియజేసినట్లయినది.

నాలుగవ శ్లోకంలో, మహోపకారకులైన భగవద్రామానుజుల శీచరణాలలో తమ మూడు కరణాలకు నిత్యం అన్వయం కలగాలి— అని వారినే ప్రార్థిస్తున్నారు. ఇంతకుముందు రెండు శ్లోకాలలో ప్రార్థించిన అర్థాలకు ప్రమాణం తిరుమంత్రం కనుక, అందులో ఉండే మూడు పదాలలో చెప్పబడిన నిష్ఠను తనకు అనుగ్రహించాలి— అని ప్రార్థిస్తున్నారు. అంటే, అనన్యార్హసశేషత్వ, అనన్య శరణత్వ, అనన్య భోగ్యత్వాలు అనే అర్థాలలో అవిచాల్యమైన స్థితి కలగాలి —అనేదే అది. దానిని, తమ బుద్ధి శ్రీ రామానుజుల శ్రీచరణాలను సదా దర్శించి ఆనందించేటట్లు చేయాలి —అని ఐదవ శోకంలో శ్రీరామానుజులను ప్రార్థిస్తూ పలుకుతున్నారు.

తిరుమంత్రంలోని మూడు పదాలతో స్పష్టంగా చెప్పబడే అర్థాలు— భగవదనన్యార్హ శేషత్వ, భగవదనన్యార్హ శరణత్వ, భగవదనన్య భోగ్యత్వాలు. ఇవి తిరుమంత్ర తాత్పర్యం కాదు. ఈ మూడు దశలు ఆచార్య విషయంలో కలగడమే తిరుమంత్రార్థంలోని యథార్థ స్థితి.

భగవద్రామానుజుల చరణకమలాలనే ఉపాయంగా అనుసంధించి శరణాగతిని చేసేవారు, మణవాళ మహామునులు. ఉపాయకృత్యం అనేది ఇష్టప్రాపణం, అనిష్ట నివారణం కనుక, మణవాళ మహామునులు ఈ ప్రబంధంలో ప్రాప్యమైన ఇష్టాన్ని మూడవ,

నాలుగవ, ఐదవ శ్లోకాలలో ప్రార్థించి, తరువాత ఏడు శ్లోకాలలో, అంటే, ఆరవ శ్లోకం నుండి ఆరంభించి, 12వ శ్లోకం పూర్తి అయ్యేవరకు తమ ఆకించన్యాన్ని, తమ దోషబాహుళ్యాన్ని విజ్ఞాపనం చేస్తున్నారు. ఇది 13వ శ్లోకంలో ప్రార్థించే అనిష్ట నివృత్తికి అనుగుణమైనది. తరువాత, 13వ శ్లోకంలో విరోధినివృత్తి ప్రార్థనను చేస్తున్నారు. అంటే, పాపాన్ని ఆర్జించే భూమియై, తత్ఫలమైన దుఃఖానుభవానికి స్థానమైన శరీరంలో ఉండడాన్ని పోగొట్టుకోకుండా, పాపాధిక్యంచేత శరీరనివృత్తిలో నాకు అపేక్ష కలగడం లేదు. అటువంటి నా పాపాన్ని మీరే తొందరగా పోగొట్టాలి—అని ప్రార్థిస్తున్నారు.

14వ 15వ శ్లోకాలలో తమ అనన్య గతిత్వాన్ని విజ్ఞాపనం చేస్తున్నారు. "నిజంగానే నీచడను అయినందున, దాసునకు దేవర వారి కృప తప్ప ఇంకొక గతి లేదు" అని అంటున్నారు, ఈ రెండు శ్లోకాల ద్వారా. "తే కరుణైవ మద్గతిః" అని నిశ్చయించి పలుకుతున్నారు. ఆముదనార్ కూరేశుల గొప్పతనాన్ని " మొழியై క్కడక్కుమ్ పెరుమ్ పుకழாన్" అనే పాశురంలో పలికిన విధంగా, వీరు కూడా "వాచామగోచర మహాగుణ" అని మొదలుగా కీర్తించి, వారు అనుగ్రహించిన అన్ని దోషాలకు, ఆ విధంగానే, ఆళవందార్, భట్టర్ అనే వీరు పలికిన అన్ని నీచకృత్యాలు అన్నిటికి నేనే ఆశ్రయమైనవాడను, అటువంటి నాకు మీ కృపయే శరణం— అని అంటున్నారు.

ఈ విధంగా మణవాళ మహామునులు తమ ఆకించన్య అనన్య గతిత్వాలను, దోషాధిక్యాన్ని అనుసంధించి, " శబ్దాదిభోగవిషయా" అని ఆరంభమయ్యే పదహారవ శ్లోకంలో విరోధినివృత్తి పూర్వకంగా ప్రాప్యంలోని చరమావధిని తమకు అనుగ్రహించాలి— అని శ్రీ రామానుజులను నిర్బంధించి ప్రార్థిస్తున్నారు. ఇది పూర్వం ప్రార్థించిన అనిష్ట నివృత్తి, ఇష్టప్రాప్తుల చరమావధి అవుతున్నది. "ఇష్ట ప్రాప్తికి, అనిష్ట నివృత్తికి ఈశ్వరుడు కదా బాధ్యుడు, అది నాకు బాధ్యతయా?"అని శ్రీ రామానుజులు అభిప్రాయపడినట్లుగా భావించి, "భగవంతుడు కూడా దేవరవారు పలికినట్లే చేసే

విధంగా మీకు వశమై ఉన్నాడు కదా, అందుచేత, మీరే దీనికి శక్తి కలిగినవారు"– అని 17వ శ్లోకంలో అనుసంధించారు.

ఉపాయంభూతుడైన భగవంతుడు మనకు భవ్యుడై, విధేయుడై ఉన్నా, అనాదికాలంగా అతని ఆజ్ఞారూపమైన శాస్త్రమర్యాదను దాటి, మూడు కరణాలతో అతి క్రూరమైన పాపాలను చేసినవారి విషయంలో భగవంతునకు కలిగే కోపాన్ని అతనిని ప్రార్థించే తీర్చుకోవాలి కదా"– అని భగవద్రామానుజుల అభిప్రాయంగా తలచి, 18వ శ్లోకంలో శ్రీ మణవాళ మహామునులు –"వాత్సల్యం కలిగిన తల్లి తానే మందు తాగి, తన బిడ్డకు కలిగిన వ్యాధిని పోగొట్టేటట్లుగా, మీరు కూడా మిమ్మలను ఆశ్రయించిన దాసులమైన మా కోసం లక్ష్మీదేవికి వల్లభుడయిన భగవంతుని శ్రీ చరణాలలో మా సర్వాపరాధాలను క్షమించాలి" అని ప్రార్థించి, "మమ్మలను అనుగ్రహించినందున దాసులమైన మాకు ఆ కొరత లేదు సుమా! "అని అంటున్నారు.

పూర్వం అనేకవిధాలుగా తమ దోషబాహుళ్యాన్ని, ఆకించన్య, అనన్యగతిత్వాలను, పాపనివృత్తిపూర్వకమైన ప్రాప్యలాభంలో తమ అపేక్షను, పాపాన్ని పోగొట్టి అపేక్షితాన్ని చేయడానికి శ్రీరామానుజులలో ఉండే శక్తి విశేషాన్ని, నిరపేక్షోపకారకత్వాన్ని మణవాళ మహామునులు విన్నపం చేయగానే, శ్రీ రామానుజుల మనసు చాలా ఆనందపడింది. "మీకు ఏమి అపేక్షితం?" అని వారు శ్రీ వరవరమునులను అడిగారు. వీరు కూడా, "నిత్యం యతీంద్ర" అనే నాలుగవ శ్లోకంలో ప్రార్థించిన విధంగా, భగవద్రామానుజుల శ్రీచరణాలలో నిరతిశయ కైంకర్యాన్ని ప్రార్థిస్తున్నారు. " అది మీకు ఇంతకు ముందే మీ ఆచార్యులు తిరుమలై అழ்வార్ ఇచ్చారు కదా" అని రామానుజులు అన్నారు. అప్పుడు మణవాళ మహామునులు " వారు అనుగ్రహించారు, నిజమే. అయినప్పటికీ, దానిని మీరు అనుదినం అనువృత్తం అయ్యేటట్లుగా చేయాలి, దానికి విరోధి అయిన నా విషయ ప్రావణ్యాన్ని పోగొట్టాలి" అని 19వ శ్లోకంలో ప్రార్థిస్తున్నారు.

శ్రీ రంగామృత కవి ఇరామానుశనూఱ్ఱన్దాది ప్రబంధం చివరలో "భగవద్రామానుజా! దేవరవారి దాసుల విషయంలో భక్తి కలిగే ఉండేటట్లుగా నన్ను చేసి, వారి విషయంలో కైంకర్యం చేసేటట్లుగా, దాసుడు వినియోగపడేటట్లుగా అనుగ్రహించాలి" అనే ప్రార్థించిన విధంగా, వీరు కూడా "ఆచార్యదాస్యాన్ని తదీయపర్యంతంగా చేయాలి" అని "తామన్వహం మమ వివర్ధయ" అని అనుసంధించి, యతిరాజ వింశతి అనే ఈ ప్రబంధాన్ని ముగించారు. శ్రీకృష్ణుడు బలరామునితో కలసి, శ్రీమాలాకారుని ప్రార్థించి, పూలమాలికలను ముడుచుకోవడం అనేది ఆ మాలాకారుని స్వరూపం ప్రకాశించడం కోసమే కదా! ప్రార్థించి, ఇతరుల కార్యాన్ని చేసేవారికి, ఇతరులు ప్రార్థించడం అధికమే అవుతుంది కదా! దేవరవారు స్వామియే కదా. సొత్తు అయినందున, శేషభూతుని కార్యాన్ని చేయడం శేషికి భరం కదా" అనే ఇటువంటి అర్థాలను "నాథ!" అనే సంబోధన ద్వారా ఇక్కడ మణవాళ మహాములు ఆవిష్కరించారు.

చివరిగా, వీరు తమ ఉభయవిధమైన అపేక్షితాన్ని విజ్ఞాపనం చేయగానే, వీరి అపేక్షితం పూర్తి చేస్తే తప్ప నిలువ లేని విధంగా భగవద్రామానుజుల కరుణ పొంగిపొర్లి ప్రవహించడానికి గమనించారు, మణవాళ మహాములు. "దాసుని విజ్ఞాపన అయిన ఈ ప్రబంధాన్ని దేవరవారు మనసులో ధరించి అనుగ్రహించాలి" అని 20వ శ్లోకంలో విన్నపించి, ఈ ప్రబంధనిగమనాన్ని చేస్తున్నారు. "దాసుని దోషాలను చూచి ఉపేక్ష చేయకుండా, దాసుడు చాపల్యంతో విన్నపించిన ఈ స్తోత్రాన్ని అంగీకరించాలి"– అని అంటూ స్తోత్రాన్ని ముగించారు.

ఇటువంటి మణవాళ మహాముల చరణకమలాలనే మనం ఉపాయంగా, ఉపేయంగా అనుసంధించి, మనసులో నిశ్చయించుకొని, తరిద్దాం.

భగవద్రామానుజుల సంబంధాన్ని తిరువాయ్ మొழி ప్పిళ్ళై మణవాళ మహామునులకు అనుగ్రహించి ఉపకరించినట్లుగా, భగవద్రామానుజుల సంబంధాన్ని మణవాళ మహామునులు ఈ ప్రబంధ పూర్వకంగా మనకు కలిగించి, మహోపకారం చేసి, మనలను ఉజ్జీవింపజేశారు. ఆ స్వామి శ్రీచరణాలలో మన తలను వంచి నమస్కరించి, వారు అభిమానించిన కైంకర్యాన్ని, వారి శ్రీచరణాలలో వరివస్యను మనం చేసి తరిద్దాం.

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్
ఎంబెరుమానార్ తిరువడిగళే శరణమ్
జీయర్ తిరువడిగళే శరణమ్.

# వేదాంతసార నిష్కర్షం

(ఈ వ్యాసాన్ని, వాగమృతవర్షి, ఉ. వే. శ్రీమాన్. వేళుక్కుడి వరదాచార్యస్వామివారు తమిళంలో అనుగ్రహించారు. శ్రీమణవాళ మహామునుల నక్షత్రోత్సవాల సందర్భంగా ఇది ఆంధ్రీకరింపబడి, ప్రపన్నలోకానికి సమర్పింపబడుతున్నది.)
శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్,
యతీంద్ర ప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్.

శ్రీరంగనాథునినుండి ఆరంభించి, భగవద్రామానులు మధ్యగా, శ్రీవరవరమునులు పర్యంతంగా ఉండే ఆచార్య పరంపర పూర్వాచార్యపరంపర అనబడుతున్నది. శ్రీ బదరీకాశ్రమంలో తిరుమంత్రాన్ని తన అంశభూతుడైన నరునకు భగవంతుడు ప్రకాశింప జేశాడు. అతడే ద్వయమంత్రాన్ని శ్రీవిష్ణులోకంలో తన దివ్యమహిషి అయిన లక్ష్మీదేవికి ప్రకాశింప జేశాడు. అర్జునుని రథం తొట్టిలో ఉండి, తనను ఆశ్రయించిన ఆ అర్జునునకు చరమ శ్లోకాన్ని ప్రకాశింప జేశాడు. అతడే దక్షిణ దేశంలో, ఉత్తర దేశంలో ఉండేవారంతా కొలిచేటట్లుగా శ్రీరంగ దివ్యక్షేత్రాన్ని నిత్య నివాసంగా చేసికొని, "తెళివిశుమ్బు తిరునాడు" అనబడే వైకుంఠాన్ని వదలిపెట్టి వచ్చి, పెరియపెరుమాళ్ గా "శంగోలుడైయ తిరువరంగ చ్చెల్వనార్" రూపం కలిగినవాడై, రహస్యత్రయాన్ని అంతటిని తన మహిషి అయిన శ్రీ రంగనాయకికి ఉపదేశించగా, తచ్ఛిష్యప్రశిష్య పరంపరగా మన వరకు, ఈనాటి వరకు రహస్యత్రయం లభిస్తున్నది. ఈ సంప్రదాయార్థం "పునరపి స ఏవ భగవాన్ శ్రీరంగనాథః స్వమహిషీ విష్వక్సేన శ్రీ పరాంకుశనాథ యామునప్రభృతి పూర్వాచార్యముఖేన శ్రీ రామానుజసిద్ధాంతనిష్ఠాతేషు శుద్ధం రహస్యత్రయసంప్రదాయమ్ అవతారయామాస" (తిరిగి ఆ భగవంతుడే శ్రీ రంగనాథుడై తన మహిషి అయిన లక్ష్మీదేవి, విష్వక్సేనులు, నమ్మాళ్వారులు, నాథమునులు, యామునమునులు మొదలైన పూర్వాచార్యుల

ద్వారా భగవద్రామానుజ సిద్ధాంతంలో నిష్ణాతులైనవారిద్వారా శుద్ధమైన రహస్యత్రయ సంప్రదాయాన్ని అవతరింప చేశాడు) అనే రహస్య త్రయమీమాంసా భాష్యంలో ఉండే సూక్తి ద్వారా వ్యక్తమవుతున్నది. అందుచేత, శ్రీ రంగనాథుడే పరమాచార్యుడు– అని ఏర్పడుతున్నది. ఈ పూర్వాచార్యపరంపరలో భగవద్రామానుజులు, రత్నహారంలో నాయకమణి వలె, ఆచార్యపరంపరకు మధ్యలో వేంచేసి ఉండి, తనకు ముందు, తరువాత ఉండే ఆచార్యులకు అందరికీ శోభను కలిగించేవారై ప్రకాశిస్తున్నారు. " అమునా తపనాతిశాయిభూమ్నా యతిరాజేన నిబద్ధనాయకశ్రీః" (సూర్యుని కంటే మించిన ప్రకాశాన్ని కలిగిన ఈ భగవద్రామానుజులను మధ్యలో నాయక మణిగా కలిగినందున గొప్ప ప్రకాశాన్ని కలిగిన ఆచార్య రత్న హారం) అనే యతిరాజసప్తతిలోని దేశికుల సూక్తి వల్ల, " అర్వాంచో యత్ పదసరసిజద్వంద్వ మాశ్రిత్య పూర్వే మూర్ధ్నా యస్యాన్వయ ముపగతా దేశికా ముక్తి మాపుః" (భగవద్రామానుజుల పాదపద్మాలను ఆశ్రయించి, వారికి తరువాత జన్మించిన ఆచార్యులు అందరూ, ఆ విధంగానే, వారి శిరఃసంబంధంచేత వారికి ముందు అవతరించిన ఆచార్యులు అందరూ ముక్తిని పొందారు) అనే పూర్వాచార్య సూక్తి వల్ల ఇది ఏర్పడుతున్నది. ఇటువంటి ఈ పూర్వచార్య పరంపరలో శ్రీ మణవాళ మహామునులు చివరివారు. అందుచేత వారు పరమాచార్యులు అవుతున్నారు. వీరు విశదవాక్ శిఖామణి కనుక, వీరి దగ్గర ఈడు వ్యాఖ్యానం కాలక్షేపం చేయాలని శ్రీరంగనాథుడు ఆశపడి, ఆ విధంగా వినడం చాలా యుక్తం. భగవద్రామానుజులు, నంబిళ్ళైవంటి పూర్వాచార్యులకు ఎవరికి లభించని గొప్పతనం శ్రీమణవాళ మహామునులకు ఒక్కరికే లభించింది. ఇదే లక్ష్మీనాథునిచేత నిరూపింపబడిన వీరి ఆచార్యత్వం. శ్రీరంగంలోని శ్రీరంగనాథుని దివ్య కృపకు లక్ష్యభూతులైన మహాచార్యులు వీరు ఒక్కరే– అనేది సత్యం, సత్యం, పునః సత్యం. అందుచేత ప్రథమాచార్యుడే చరమాచార్యులకు శిష్యుడైనాడు– అనేది వ్యక్తమవుతున్నది. కనుక, మన పూర్వాచార్యపరంపర ఒక అద్భుతమైన హారంగా వెలుగుతున్నది. ఇది ఒక అద్వితీయమైన ఆచార్య చక్రం. ఈ ఆచార్య చక్రాన్ని ఆశ్రయించేవారు అనాదిసిద్ధమైన సంసార చక్రంనుండి ఉత్తీర్ణులు కాగలరు –అని

చిరకాలం పెద్దలను ఆశ్రయించి, సదర్థాలను తెలిసిన చిరోపాసితసద్వృద్ధులు అంటారు. శ్రీ మణవాళ మహాముసుల తిరునక్షత్రోత్సవ సందర్భంగా వారు దర్శించిన వేదాంతసార నిష్కర్షం ఏమో సంగ్రహంగా గమనిద్దాం.

"మానాధీనా మేయసిద్ధిః" అని అంటారు, పెద్దలు. మన దర్శనానికి ప్రమాణాలు మూడు. అవి– ప్రత్యక్షం, అనుమానం, శబ్దం– అనేవి. శబ్దప్రమాణం శ్రుతి, స్మృతి, మీమాంసలు– అనే మూడు విధాలుగా ఉంటుంది, శ్రుతి కూడా వేదం, వేదాంతం, వేదాంతసారం– అని మూడు విధాలుగా ఉంటుంది. వేదంలోని పూర్వభాగం వేదం అని, ఉత్తరభాగం వేదాంతం అని, రహస్యత్రయం వేదాంతసారం –అని చెప్పబడుతున్నవి. ఆ వేదాంతసారంలోని నిష్కర్షం ఇటువంటిది– అనే విషయాన్ని కొంచెం వివరంగా ఇప్పుడు అనుభవిద్దాం.

వేదాన్ని ఈ విధంగా విభాగం చేయడంలో ప్రమాణం ఉన్నదా? అనే విషయాన్ని మొదట గమనించి చూద్దాం. "అసారమ్ అల్పసారం చ సారం సారతరం త్యజేత్, భజేత్ సారతరం శాస్త్రం రత్నాకర ఇవామృతమ్" అని వైకుంఠ దీక్షితులు పలికిన వచనం ప్రమాణభావాన్ని ఈ విషయంలో పొందుతున్నది. ఇక్కడ ఈ వచనంలో రత్నాకరం దృష్టాంతంగానూ, శాస్త్రం దార్ ష్టాంతికంగాను చూపబడింది– అనే విషయాన్ని గమనించాలి. సముద్రంలో అణగి ఉండే అసారాది చతుష్టయం విడువదగినది. సారతమం అయిన, ఐదవది అయిన అమృతం ఉపాదేయమైనది. ఈ విధంగానే, శాస్త్రంలో అణగి ఉండే అసారాదులను విడచిపెట్టి, సారతమాన్ని గ్రహించాలి –అని ఈ శ్లోకార్థం– అనే విషయం ఇక్కడ తేలుతున్నది.

ఈ శ్లోకాన్ని వేదాంతదేశికులు రహస్య త్రయసారంలోని సారనిష్కర్షాధికారంలో ఉదాహరించి, ఇందులోని అర్థాన్ని వివరించారు. ఆ సందర్భంలో ఉండే "శ్రుతిపథ విపరీతమ్" అనే శ్లోకాన్ని, "బాహ్య కుదృష్టిశాస్త్రంగళ్" అని మొదలైన వారి వాక్యాలను

గమనించాలి. దేశికులు చేసిన వ్యాఖ్యానాన్ని అనుసరించి, బాహ్యకుదృష్టి శాస్త్రాలు అసారాలు– అని, వేదంలోని పూర్వ భాగంలో ఐహిక ఫల, తత్సాధన ప్రతిపాదక భాగం, అంటే, ఇహలోకాలలో అనుభవించే ప్రయోజనాలను, వాటిని కలిగించే సాధనాలను తెలియజేసే భాగం అల్పసారం– అని, ఆముష్మిక ఫల తత్సాధన ప్రతిపాదక భాగం సారం– అని, ఆత్మప్రాప్తి, తత్సాధన ప్రతిపాదక భాగం సారతరం– అని, పరబ్రహ్మ ప్రాప్తి, తత్సాధన ప్రతిపాదక ప్రదేశం సారతమం– అని, ఇదే వివేకం కలిగినవారికి ఉపాయం అనేది ఈ శ్లోకార్థం– అని తెలుస్తున్నది. శ్లోకంలో ఉండే శాస్త్రపదం వేదతదనుయాయి తద్విరుద్ధ సకలశాస్త్రపరం. అంతే తప్ప, శ్రుతి మాత్రపరం కాదు. ఆ విధంగా శ్రుతిని మాత్రమే తెలిపితే, అసారమైన బాహ్యశాస్త్రం శ్రుతిలోకి చేరనందున, " శాస్త్రే" అనే నిర్ధారణ సప్తమి బాధింపబడుతుంది. "శ్రుతి పథ విపరీతమ్" అనే శ్లోకానికి స్వారస్యం లేకుండా కూడా పోతుంది–అనే పెద్దల టీకవల్ల ఈ విషయం వ్యక్తమవుతున్నది.

అయినప్పటికీ, పరిశీలిస్తే, అసారపదానికి బాహ్యకుదృష్టి శాస్త్రపరత్వం గ్రహించడం ఉచితంగా కాదు– అని తోస్తుంది. అసారశాస్త్రాన్ని విడచిపెట్టు–అని కదా అన్వయం గ్రహించాలి. బాహ్యకుదృష్టి శాస్త్రాలకు శాస్త్రత్వమనేదే లేదు కదా. అలౌకికఫలాలు, వాటి సాధనాలు మొదలైనవానిని ప్రతిపాదించేవి కదా, శాస్త్రం. "శాసనాత్ శాస్త్రం" అని కదా చెప్పబడుతున్నది. బాహ్యకుదృష్టి శాస్త్రాలకు సాక్షాత్తుగా కానీ, శిక్షాదులవలె పరంపరయా కానీ పురుషార్థసంబంధం లేదు. " యా వేదబాహ్యా స్మృతయో యా శ్చ కాశ్చ కుదృష్టయః, సర్వా స్తాః నిష్ఫలాః ప్రేత్య తమోనిష్ఠా హి తాః స్మృతాః" అని కదా మనుభగవానుడు అనుగ్రహించాడు. ఇంతే కాక, " వేదాత్ శాస్త్రం పరం నాస్తి "అని బాహ్య కుదృష్టి శాస్త్రాలకు శాస్త్రత్వం నిషిద్ధం. ఈ సందర్భంలో పరశబ్దం ఉత్కృష్ట పరం కాదు. ఆ విధంగా అయితే, ఉత్కృష్టనిషేధంలో సమాభ్యనుజ్ఞ ప్రసంగిస్తుంది. అందుచేత పరశబ్దం అన్యవాచి అని గ్రహించాలి వేదభిన్నానికి శాస్త్రత్వం నిషేధింపబడుతున్నది. అంతేకాక, త్యాజ్యోపాదేయ విభాగం ఏకావయవిలో చేయబడుతున్నది– అని దృష్టాంతం వల్ల సిద్ధిస్తున్నది. సముద్రం అనే ఒకే అవయవిలో

కదా ఆసారాది పంచకం చెప్పబడుతున్నది. ఆ విధంగానే, వేదశాస్త్రం అనే ఒకే అవయవిలో అసారాదిపంచకం చెప్పబడడం యుక్తం. అందుచేత అసారపదం బాహ్యశాస్త్రాదిపరం కాదు —అని తెలుస్తున్నది.

ఇక, ఈ శ్లోకంలో ఉండే వాస్తవమైన అర్థాన్ని గమనిద్దాం. వేదంలో ఐహికమైన, ఆముష్మికమైన ఐశ్వర్యం గూర్చి ప్రతిపాదించే భాగం— అసారం. ఆత్మప్రాప్తి తత్సాధన ప్రతిపాదకభాగం— అల్పసారం. పరమాత్మ ప్రాప్తి త్సాధన ప్రతిపాదకభాగం— సారం. భగవదనుభవ పరీవాహ స్వార్థకైంకర్యతత్సాధన ప్రతిపాద భూతాత్మసమర్పణ ప్రతిపాదకభాగం— సారతరం. పరార్థకైంకర్య తత్సాధన సిద్ధోపాయ ప్రతిపాదకభాగం —సారతమం —అనేది వాస్తవార్థం. ఈ విధంగా గ్రహిస్తే పదాల స్వారస్యం చక్కగా సిద్ధిస్తుంది. అందుచేత, వేదం కంటే భిన్నమై, సారతమమైన శాస్త్రమైన రహస్యత్రయమే వేదాంత సారం— అని తెలుస్తున్నది. ఇక, మణవాళ మహాములు దర్శించిన దీని నిష్కర్షాన్ని నిరూపిస్తాను.

వైదికులైన పెద్దలు వేదాంతార్థాలను నిర్వహించే రీతులు వేరు„వేరుగా ఉంటాయి. ఏ విధంగా అంటే— వేదం, జ్యోతిష్టోమాది కర్మలను ప్రధానంగా తెలుపుతున్నది. వేదాంత విషయం అయిన బ్రహ్మం జీవభిన్నమైన ఒక తత్వం కాదు. యాగాది కర్మలను చేసే జీవాత్మనే వేదాంతాలు ప్రశంసిస్తున్నాయి. అందుచేత, వేదం కర్మపరం. కర్మలను చేసే జీవుల ప్రశంసాపరం వేదాంతం— అని వేదార్థాన్ని కొంతమంది వైదికులు వివరిస్తారు. వేదాంతం భక్తిప్రపత్తులు అనే అనేక ఉపాయాలను ప్రతిపాదిస్తున్నది. " నానాశబ్దాదిభేదాత్, వికల్పః, అవిశిష్టఫలత్వాత్" అని కదా సూత్రకారులు అన్నారు. రహస్యత్రయం కూడా వేదాంతంలో అంతర్భవించినదే తప్ప వేరు శాస్త్రం కాదు. పూర్వభాగం అయిన వేదంలో చెప్పబడిన కర్మ భగవత్ కైంకర్య రూపమే అవుతున్నది. అది కూడా స్వార్థం, అంటే, మన ఆనందానికి తగినట్లు చేయబడేది. భక్తి ప్రపత్తులు కూడా భగవంతుని పొందడానికి ఉపాయాలు. అంటే,

భగవత్ ప్రసాదాన్ని కలిగించేవి. మన భక్తి ప్రపత్తులలతో భగవంతునకు కృప కలుగుతుంది, కనుక, భగవత్ ప్రసాదం సహేతుకం –అని వేదాంతార్థాన్ని మరి కొంతమంది వైదికులు వివరిస్తారు. భగవంతుడు సిద్ధోపాయభూతుడు. అతడు వేరు సహాయాన్ని అపేక్షించని నిరపేక్షోపాయం అవుతున్నాడు. జీవుడు చేసే భక్తి ప్రపత్తులు " తం హ దేవమ్ ఆత్మబుద్ధిప్రకాశమ్" అనే విధంగా భగవంతుని అనుగ్రహించేత కలుగుతున్నవి. ఆ స్వామి అనుగ్రహంతో కలిగేవి, అవి. ఉపాయం ఫలభూతం కాదు– అని భావం. "ఆత్మబుద్ధేః ప్రకాశః యస్మాత్ సః ఆత్మబుద్ధి ప్రకాశః, తద్విషయ భక్తిస్ఫురణస్య తదనుగ్రహాయత్తత్వాత్" (ఆత్మబుద్ధి ప్రకాశం ఎవరి వల్ల కలుగుతున్నదో అతడు, అంటే, భగవంతుడు ఆత్మబుద్ధిప్రకాశపదంచేత చెప్పబడుతున్నాడు, ఎందుకంటే, ఆ భగవంతుని విషయంలో భక్తి కలగడం అనేది కూడా ఆ భగవంతుని అనుగ్రహానికి లోబడినదే కనుక) అనే శ్రీ రంగరామానుజముని భాష్యసూక్తి గమనించదగినది. " ఎన్ ఉణర్విను‌ళ్ళే ఇరుత్తినేన్, అదువుమ్ అవనదిన్నరుళే" (భగవంతుని నా జ్ఞానానికి విషయంగా చేసికొన్నాను, అది కూడా భగవంతుని అనుగ్రహం వల్లనే), " ఎనదావి యార్? యానార్? తంద నీ కొండాక్కినైయే" (నా ఆత్మ ఎవరు? నేనెవరు? నా ఆత్మను నాకు అనుగ్రహించిన నీవే దానిని పరిగ్రహించావు కదా) అని ప్రపన్న జన కూటస్థులైన నమ్మాళ్వారుల తిరువాక్కు. "అథవా కిన్ను సమర్పయామి తే" (లేకపోతే, నీకు ఏమి నేను సమర్పించగలను? నాది అనేది అంతా నీదే కదా!) అనేది భగవద్యామునుల సూక్తి. " వరద! తవ ఖలు ప్రసాదాదృతే శరణమితి వాచో ౽ పి నోదియాత్" (వరదరాజస్వామీ! నీ అనుగ్రహం లేకపోతే, శరణం అనే పదం కూడా నా నోటినుండి వెలువడ లేదు) అనేది కురేశుల వాక్కు. ఇవి అన్నీ ఇక్కడ అనుసంధేయాలు. అందుచేత, భక్తి ప్రపత్తులు అనేవి భగవంతుని కృపాఫలాలు–అని స్పష్టమవుతున్నది. వేదంలోని పూర్వ భాగంలో చెప్పబడిన కర్మ భగవంతుని కైకర్య రూపం. అదికూడా పరార్థమే. అతని ముఖం వికసించడం కోసంగానే చేయదగినది. వేదంలోని ఉత్తర భాగంలో చెప్పబడిన భక్తి అనేది ప్రాప్య రుచి అవుతున్నది. ప్రాపత్తి అనేది స్వరూప యాథాత్మ్యజ్ఞానరూపం

అవుతున్నది. ప్రసాద విశిష్టుడైన భగవంతుడే ఉపాయభూతుడు. అతని అనుగ్రహం నిర్హేతుకం. ఫలానికి కావలసినది ఆత్మజ్ఞానం, భగవంతుడు మనలను రక్షించడానికి చేసే ప్రయత్నాన్ని అడ్డుకోకపోవడం అనే అప్రతిషేధం— అనేవే. ఈ విధంగా పరమవైదికులైన మన పూర్వాచార్యులు వేదాంతార్థాన్ని వివరిస్తారు.

ఈ అర్థనిష్కర్షం వేదాంతసారలబ్ధం అనే విషయాన్ని తెలియజేస్తాను. వేదం పూర్వ భాగంలో ప్రతిపాదింపబడిన కర్మల యథార్థ రూపం భగవత్ కైంకర్యత్వం అవుతున్నది. వేదాంతంలో ప్రతిపాదింపబడే బ్రహ్మ యొక్క స్వరూపం నిరపేక్షోపాయత్వం. వేదాంతంలో ప్రతిపాదింపబడే భక్తి యొక్క యథార్థ స్థితి ప్రాప్యరుచిత్వం, అంటే, భగవంతుని అనుభవ కైంకర్యాల విషయంలో ఉండే ప్రీతియే. వేదాంతంలో ప్రతిపాదింపబడిన ప్రపత్తియొక్క యథార్థమైన ఆకారం— స్వరూప యాథాత్మ్యజ్ఞానత్వం, అంటే, జీవాత్మయొక్క సహజ స్థితి అయిన భగవంతునకు అత్యంతం పరతంత్రంగా ఉండడమనేదానిని విషయంగా కలిగిన జ్ఞానమై ఉండడం. ఇవి కూడా, అంటే, ఈ అధికారికి ప్రాప్యమైన భగవత్కైంకర్యంలోని పరార్థత్వం మొదలైనవి కూడా వేదాంత సారవేద్యాలే అవుతున్నాయి, అంటే, అవి రహస్యత్రయాల ద్వారా తెలియదగినవి— అని అర్థం.

ఈ అర్థాలను, కొన్ని ఉదాహరణలను ప్రస్తావించడంద్వారా వివరిస్తాను.

1) ఘటపటాది భేదం ప్రత్యక్ష సిద్ధం కనుక, " అప్రాప్తే హి శాస్త్రమ్ అర్థవత్" (అంతవరకు తెలియని దానిని తెలుపుతున్నది కనుక, శాస్త్రం అర్థవంతం అవుతున్నది) అనే న్యాయాన్నిబట్టి, భేదం అనేది వేదాంత వేద్యం కాదు. జీవపరాభేదమే వేదాంతంలోని అర్థం— అని అంటారు, మాయావాదులు. ఈ వాదానికి తగిన సమాధానాన్ని నడాదూర్ అమ్మాళ్ అనే వాత్స్యవరద గురువులు తత్వసారం అనే ఒక గ్రంథంలో సమాధానాన్ని అనుగ్రహించారు. " ప్రత్యక్షాదితరస్తు శాస్త్రవిషయః భేదః

త్వదద్వైతవత్" అని వారు అన్నారు. దీని భావం ఏమంటే –ప్రత్యక్ష సిద్ధమైన భేదం స్వతంత్ర భేదం. వస్తువులు భగవత్ శేషత్వాన్ని కలిగినవి– అని తెలియకుండా, స్వతంత్రాలుగానే తెలియబడేవిగా ఉంటాయి. ఇది ప్రత్యక్ష సిద్ధం. ఇక, శాస్త్రంతో మాత్రమే తెలియదగిన అర్థం ఏమి? అంటే, ఇవి అన్నీ భగవద్విభూతులు, భగవంతునకు పరతంత్రాలు, భగవంతునకు సొత్తు అయినవి –అనేదే. అందుచేత, ఈ విధంగా ప్రత్యక్షం ద్వారా వీటి స్వాతంత్రం తెలియబడినప్పటికీ, శాస్త్రం ద్వారానే వీటి పారతంత్ర్యం అనే స్వరూప యాథాత్మ్యం తెలియబడేటట్లుగాను,

2) ఘటపటాది శబ్దాలు పదవ్యుత్పత్తి, నిఘంటువులు మొదలైనవాటిద్వారా కుండ, వస్త్రం మొదలైన వస్తువులకు మాత్రం వాచకాలు అని తెలుస్తున్నది. అయినా, సకలశబ్దాలు భగవంతుని పర్యంతంగా తెలియజేస్తాయి– అనే అర్థం "వచసాం వాచ్య ముత్తమమ్" అని మొదలైన శాస్త్రవచనాల ద్వారానే తెలిసే విధంగానూ,

భక్తి ప్రపత్తులు ఉపాయాలు– అని మొదలైన అర్థాలు వేదాంతాల ద్వారా మనం తెలిసినప్పటికీ, ఈ భక్తి ప్రపత్తుల సహజమైన స్వరూపాన్ని వేదాంత సారభూతమైన రహస్యత్రయం ద్వారానే తెలియాలి –అని భావం.

కర్మ ప్రాధాన్యవాదులు వేదపూర్వ భాగార్థనిష్ఠులు. వారిని – భక్తి ప్రపత్తులు ఉపాయాలు. స్వార్థకైంకర్యం పురుషార్థం– అని చెప్పి వేదాంతవిదులు ఖండించారు. ఆ వేదాంతులను– భక్తి ప్రపత్తులు అధికారి విశేషణాలు, అవి భగవత్ కృపాభూతాలు. పరార్థకైంకర్యమే పరమ పురుషార్థం– అని పలికి వేదాంతసారనిష్ఠులు ఖండించారు. ఈ విధంగా వేదాంతాల కంటే భిన్నమై, ఉన్నతమై ఉండే వేదాంతసారమైన రహస్యత్రయం– పరార్థకైంకర్యం ఫలం భక్తి ప్రపత్తులు భగవంతుని అనుగ్రహఫలాలు –అని చేసే అర్థనిష్కర్షమే వేదాంతసార నిష్కర్షం. ఈ అర్థమే పంచమమైన అర్థం. సారతమమైన అర్థం. దీనికి ప్రతిపాదకమైన వేదాంత సారమే ఉపాదేయం– అని చెప్పినట్లయిది.

అర్థతత్త్వం ఈ విధంగా ఉండగా, దేశికులు "శ్రుతి పథవిపరీతమ్" అని అనడంలో ఏమి కారణం? అని అంటే,

"వీతరాగవ్యతిరిక్తానాం కర్మణి అశ్రద్ధానిరాసార్థం అన్వారుహ్యావాదః" (వితరాగుల కంటే భిన్నులయినవారికి వైదిక కర్మలలో అశ్రద్ధను కలిగి ఉండకుండా చేయడంకోసమే ఈ విధంగా అన్వారుహ్యావాదం చేయబడింది) అనే విధంగా, అధికారులకు కర్మలలో అశ్రద్ధను పోగొట్టడం కోసం జైమిని బ్రహ్మశాస్త్రాన్ని కర్మశాస్త్ర శేషంగా వర్ణించడం ఏ విధంగా అన్వారుహ్యావాదమో, ఆ విధంగానే, ఆత్మయాథాత్మ జ్ఞానం లేనివారికి సాధ్యోపాయశాస్త్రంలో అశ్రద్ధను తీర్చడం కోసం సిద్ధోపాయశాస్త్రం, అంటే, రహస్యత్రయం భిన్నమై ఉన్నప్పటికీ, అది సాధనభక్తి ప్రపత్తిశాస్త్రరూప వేదాంతాలలో అంతర్భూతం– అని అన్వారుహ్యావాదంగా చెప్పారు, దేశికులు– అని ఇక్కడ భావించాలి. ఈ సందర్భంలో

విషయః సారభాగో ఽ యం వేదాంతాత్ పర ఇష్యతే,
పరత్వం సార శాస్త్రస్య హి అసార మితి మానదః"
అని మొదలైన వచనాలను అనుసంధించాలి.

దీనివల్ల స్పష్టపడిన విషయం ఏమంటే– వేదాన్ని వేదాంతానుగుణంగా అన్వయించినట్లుగానే, వేదాంతాన్ని వేదాంతసారానుగుణంగా అన్వయించాలి– అని స్పష్టమవుతున్నది. అందుచేత, శారీరక శాస్త్రానుగుణంగా రహస్యత్రయాన్ని అన్వయించడం ఉచితం కాదు, రహస్యత్రయానుగుణంగానే శారీరక భాష్యాదుల నయనం తగినది– అని తెలుస్తున్నది, ఎందుకంటే, రహస్యత్రయ ప్రస్థానం సారతమం కనుక– అని ఇక్కడ తాత్పర్యం.

శ్రుతిస్మృతీతిహాసపురాణపాంచరాత్రరూప సకలశాస్త్రాల నిర్ణాయకం శారీరకం– అని చెప్పడం కూడా సాధ్యం కాదు. శ్రుత్యర్ధనిర్ణాయకం శారీరకం అయినప్పటికీ, స్మృత్యాదుల అర్ధనిర్ణాయకం శారీరకం– అని అనడానికి వీలు కాదు. వేదవ్యాసమహర్షి ఒక అధికరణంలో శ్రుత్యర్థాలలో ఒక అర్థాన్ని న్యాయమార్గసంచారం చేసి నిశ్చయించి, దానికి సంవాద ప్రమాణంగా "స్మృతేశ్చ", " స్మరంతి చ" అని స్మృత్యాధులను ఉదాహరించారు. " సాత్రి తర్కప్రతిష్ఠా" అని దేశికులు పలికిన మాటను, "ద్వయం ఖలు తర్కజాతం, శ్రుతివిరుద్ధమ్, అవిరుద్ధం చేతి. తేన తర్కాప్రతిష్ఠా వచనమ్. " ఆర్షం ధర్మోపదేశం చ" ఇత్యాదిప్రకారేణ వేదవిరుద్ధతర్కావిషయతయా యోజ్యమ్, న పునః వేద ఇతికర్తవ్యతారూప తర్కవిషయమ్ " అని దేశికుల కుమారులు పలికిన వచనాన్ని ఇక్కడ అనుసంధించాలి అధీతశాఖార్ధ నిర్ణాయకం న్యాయం, అనధీతశాఖార్థ నిర్ణాయకం స్మృత్యాదులు– అని కదా నిష్కర్షం. శ్రుతిలో కూడా సార్వత్రికమైన న్యాయసంచారం లేదు. అస్పష్ట స్థలాలలో మాత్రమే న్యాయసంచారం చేయబడుతున్నది. "న్యాయ నిరపేక్షమాక సిద్ధమ్" అనే రహస్యత్రయసార పరికరవిభాగాధికారంలో దేశికులు పలికిన వాక్యం గమనించదగినది. శ్రుతులలో వలె స్మృతులలో కూడా న్యాయసంచారాన్ని చేస్తే, ఉపబృంహ్య –ఉపబృంహణ భేదమనేదే లేకుండా పోతుంది. న్యాయాలను అభ్యసించిన శ్రీమైత్రేయుడు శ్రీపరాశర భగవానుని పురాణ శ్రవణం చేయడం కోసం సమీపించారు" అని కదా శ్రీవిష్ణుపురాణం ప్రారంభమవుతున్నది. " భాష్యకారర్ ఇదుకొండు సూత్రవాక్యంగళ్ ఒరుంగవిడువర్" (బాష్యకారులు ఈ రహస్యత్రయ వివరణ రూపమైన తిరువాయ్ మొழி ప్రబంధాన్ని పురస్కరించుకొని బ్రహ్మసూత్ర వాక్యాలను వివరించారు) అని అழగియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్ కూడా అన్నారు. " శెయ్య తమిழ் మాలైకళ్ నామ్ తెళియ ఓది తెళియాద మఱై నిలంగళ్ తెళికిన్హోమే" (ఋజువైన ఆళ్వారుల ద్రావిడ పాశురాలను మేము స్పష్టంగా అభ్యసించి, అంతవరకు తెలియని వేదార్థాలను తెలుసుకున్నాము) అని దేశికులు కే అనుగ్రహించిన వాక్యాన్ని విశితంగా గమనించాలి. దివ్య సూరి వచనాలను పురస్కరించుకుని కదా శారీరకార్ధనిర్ణయం– అని చెప్పబడినది.

శారీరకార్థాలను పురస్కరించుకొని ఆళ్వారుల పాశురాలలోని అర్థాలు నిశ్చయింపబడినవి– అని చెప్పలేదు కదా. అందుచేత, ఉపబృంహణాలకు శారీరక న్యాయాపేక్ష పొసగదు, కనుక, వేదాంతసార భూతమైన రహస్యత్రయానుగుణంగానే శారీరకాదుల అన్వయం చేయాలి –అని ఏర్పడుతున్నది.

ఈ విధంగా, వేదాంత శారీరకాదులలో ప్రతిపాదింపబడే భక్తిప్రపత్తులు ఫలం, బ్రహ్మం ఒకటే ఉపాయం. వేదంలోని పూర్వభాగంలో చెప్పబడిన కర్మం పరార్థకైంకర్యమే అవుతున్నది– అనేది వేదాంతసార నిష్కర్షం– అని తేలింది.

శ్రీమతే రమ్యజామాతృమునీంద్రాయ మహాత్మనే,
శ్రీరంగవాసినే భూయాత్ నిత్యశ్రీః నిత్యమంగళమ్.

## భగవద్రామానుజులు– శ్రీమద్వరవరమునులు

(కాంచీ మహావిద్వాన్, ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్యస్వామివారు అనుగ్రహించిన ద్రావిడవ్యాసం ఆధారంగా)

శ్రీ మణవాళ మహామునులకు యతివర పునరవతారభూతులు అనే ప్రసిద్ధి ఉన్నది. భగవద్రామానుజులే తిరిగి శ్రీమణవాళ మహామునులుగా అవతరించారు–అని దీని అర్థం. ఈ విధంగా భావించడానికి తగిన ఉపపత్తులు కూడా కొన్ని ఉన్నాయి. వాటిని ముందుగా శ్లోక రూపంలో విజ్ఞాపించి, తరువాత వివరిస్తాను.

1) వ్యాఖ్యానగ్రంథదానాత్ పరివదనకథాగంధవైదేశికత్వాత్
నానాశాస్త్రార్థ బృందప్రకరఫణితిభిః ప్రాజ్ఞహృద్రంజకత్వాత్,
పూర్వాచార్యోక్తిరాగాత్ శఠరిపుమునిరాట్ సూక్తిసంవర్ధకత్వాత్
పీఠాధీశప్రతిష్ఠాపనకృతికరణాత్ దివ్యదేశాభిమానాత్

2) ఫణిరాజావతారత్వాత్ శ్రీరంగశ్రీవివర్ధనాత్,
యతీంద్రప్రవణః సాక్షాత్ యతీంద్రో భాష్యకృత్ ధ్రువమ్.
ఇప్పుడు ఈ రెండు శ్లోకాలు సంక్షేపంగా వివరింపబడుతున్నాయి.

**(వ్యాఖ్యానగ్రంథదానాత్)** ఇంచుమించుగా వ్యాఖ్యాన గ్రంథాలను అనుగ్రహించడంలోనే దృష్టిని కలిగి ఉండడంలో భగవద్రామానుజులకు, మణవాళ మహామునులకు సామ్యం ఉన్నది. శ్రీ భాష్యం, వేదాంతదీప సారాలు, గీతాభాష్యం అనే ఇవి వ్యాఖ్యాన గ్రంథాలే కదా. మణవాళ మహామునుల
వ్యాఖ్యాన గ్రంథాలు కూడా ప్రసిద్ధాలు. వేదాంత సంగ్రహం, గద్యత్రయం అని కొన్ని స్వతంత్ర గ్రంథాలను శ్రీరామానుజులు అనుగ్రహించినట్లుగా, మణవాళ మహామునులు

కూడా యతిరాజ వింశతి, ఉపదేశ రత్తినమాలై మొదలైన మూలగ్రంథాలను అనుగ్రహించడం ప్రసిద్ధమైనది.

**(పరివదనకథాగంధ వైదేశికత్వాత్)** పరివదనం అంటే పరీవాదం, అంటే, నింద అని అర్థం. అస్థానే నిందా పరిహాసాలనతో నిండిన గ్రంథాలను వ్రాయడం లోకంలో చాలామందికి అలవాటు. ఆ విధంగా నింద గాని, పరిహాసాన్ని గాని అణుమాత్రం కూడా లేకుండా, పరమ పవిత్రమైన శ్రీసూక్తిజాలాన్ని అనుగ్రహించడంలో భగవద్రామానుజులకు, శ్రీ మణవాళ మహామనులకు పోలిక ఉన్నది.

**(నానాశాస్త్రార్థ బృందప్రకరఫణితిభిః ప్రాజ్ఞహృద్రంజకత్వాత్)** దర్శించిన సందర్భాలలో అంతట అనేక శాస్త్రార్థబృందాలతో నిండిన శ్రీసూక్తులతో పండితుల మనసులను ఆనందింప జేసే స్వభావం కలిగి ఉండడాన్ని శ్రీ రామానుజులలో, మణవాళ మహామునులలో దర్శించవచ్చు.

**(పూర్వాచార్యోక్తిరాగాత్)** భగవద్రామానుజులు శ్రీభాష్య గ్రంథాన్ని ఆరంభించేటప్పుడే " భగవద్బోధాయనకృతాం విస్తీర్ణాం బ్రహ్మసూత్రవృత్తిం పూర్వాచార్యాః సంచిక్షిపుః. అథ తన్మతానుసారేణ సూత్రాక్షరాణి వ్యాఖ్యాస్యంతే" (భగవానులైన బోధాయనులు రచించిన విస్తృతమైన బ్రహ్మసూత్రవ్యాఖ్యానాన్ని పూర్వాచార్యులు సంగ్రహించారు. అందుచేత వారి మతాన్ని అనుసరించి, బ్రహ్మసూత్రాలలోని అక్షరాలు వివరింపబడుతున్నాయి) అనే పలికి, పూర్వాచార్య సూక్తులలో తమకు గల ఆదరాతిశయాన్ని వ్యక్తం చేశారు. మణవాళ మహామునులు కూడా "మున్నోర్ మొழிన్ద ముఱై తప్పామల్ కేట్టు" (పూర్వాచార్యులు పలికిన క్రమాన్ని తప్పకుండా ఆలకించి) అని, "మున్నవరామ్ నమ్ గురవర్ మొழிగళై ఉళ్ళ ప్పెఱ్ఱోమ్, ముழுదు నమక్కవై పొழுదు పొక్కాగ ప్పెఱ్ఱోమ్" (ఇంతకు ముందు ఉన్న పూర్వాచార్యుల సూక్తులను అనుసంధించగలిగాము, వాటినే పూర్తిగా మనకు కాలక్షేపంగా

పొందగలిగాము) అని మొదలైన సూక్తులతో తమకు గల పూర్వాచార్యసూక్తి బహుమానాన్ని వ్యక్తం చేశారు., అంతమాత్రమే కాకుండా, తమ వ్యాఖ్యాన గ్రంథాలను పూర్వాచార్యుల సూక్తిమయంగానే అవతరింపజేశారు.

**(శఠారిపుమునిరాట్ సూక్తిసంవర్ధకత్వాత్)** భగవద్రామానుజుల వా*ళ్ళి* తిరునామంలో "మాఱనురై శెయ్ ద తమి*ళ్* మ*ఱ్ఱై* వళర్ త్తోన్ వా*ళ్ళి*యే" (నమ్మాళ్వార్లు అనుగ్రహించిన, ద్రావిడ వేదమైన తిరువాయ్ మొ*ళ్ళి* దివ్య ప్రబంధాన్ని పెంచి వృద్ధి చేసినవారు) అని, " అయ్ న్దద పెరుమ్ శీరార్ శడకోపన్ శెందమి*ళ్* వేదమ్ దరిక్కుమ్ పేరాధ ఉళ్ళమ్ పెఱ, ఏయ్ న్ద పెరుమ్ కీర్తి ఇరామానుశ మునిదన్ వాయ్ న్ద మలర్ పాదమ్ వణంగుగిన్డేన్" (గొప్ప కైంకర్య సంపదను కలిగిన నమ్మాళ్వారులు అనుగ్రహించిన, అందమైన ద్రావిడవేద రూపమైన తిరువాయ్ మొ*ళ్ళి* దివ్య ప్రబంధాన్ని మనసులో నిలుపుకునే శక్తిని కలిగి ఉండడం కోసం, గొప్ప కీర్తిని కలిగిన భగవద్రామానుజమునుల అందమైన, తామర పువ్వులవంటి శ్రీచరణాలను నమస్కరిస్తున్నాను) అని వారి కాలంలోనే వారి శిష్యులు సేవించినట్లుగా మనం చూస్తున్నాము దీనిని గూర్చి మామునుల విషయంలో ఇక చెప్పాలా? " శే*ఱ్ఱు* క్కమల వయల్ శూ*ళ్* అరంగర్ తమ్ శీర్ త*ఱ్ఱై*ప్ప పో*ఱ్ఱి* త్తో*ళ్* నల్ల అందణర్ వా*ళ్* ఇప్పూతలత్తే మా*ఱ్ఱఱ్ఱ* శంబొన్ మణవాళ మాముని వందిలనేల్, ఆ*ఱ్ఱి*ల్ కరైత్త పుళియల్లవో తమి*ళ్ళా*రణమే! " (బురదలో పూసిన, అందమైన తామర పువ్వులు నిండిన క్షేత్రాలను చుట్టూ కలిగిన శ్రీరంగంలో వేంచేసి ఉండే శ్రీరంగనాథుని కళ్యాణ గుణాలను కీర్తించి, సేవించే ఉత్తములైన బ్రాహ్మణులు నివసించే ఈ భూతలంలో ఏ దోషం లేని, ఋజువైన అందమైన మణవాళ మహామునులు అవతరించి ఉండకపోతే, నదిలో కలసిన చింతపండువలె ద్రావిడ వేదమైన తిరువాయ్ మొ*ళ్ళి* వ్యర్థమై ఉండేది కదా) అనే పాశురం ఒక్కటే చాలు కదా.

**(పీఠాధీశ ప్రతిష్ఠాపన కృతికరణాత్)** భగవద్రామానుజులు 74మంది సింహాసనాధిపతులను స్థాపించి, వారి ద్వారా దర్శననిర్వాహన్ని చేయడం చరిత్ర ప్రసిద్ధం. "లక్ష్మీనాథాఖ్యసింధౌ శఠరిపుజలదః" అని మొదలైన శ్లోకరత్నంతో ఇది సుప్రసిద్ధం. మణవాళ మహామునులు కూడా "తిరమాక దిగ్గజంగళ్ ఇట్టరుళుమ్ పెరుమాళ్" అని కీర్తించే విధంగా అష్టదిగ్గజాలు అనే ఎనిమిది మంది పండితులను స్థాపించి, వారి ద్వారా దర్శన నిర్వాహం చేయడం సర్వలోక సుప్రసిద్ధం.

**(దివ్యదేశాభిమానాత్)** ఈ విశేషణానికి రెండు విధాలుగా అర్థాన్ని చెప్పవచ్చు. మన్నియ తెన్నరంగాపురి మామలై ము*ఱ్ఱు* మువందిడు నాళ్" (స్థిరంగా నిలచి ఉండే దక్షిణ దిక్కులోని శ్రీరంగ నగరం, తిరుమల పూర్ణంగా ఆనందించే దినం) అని, " శ్రీరంగం కరిశైల మంజనగిరిం తార్ క్ష్యాద్రి సింహాచలౌ, --- శ్రీరంగేశ జయధ్వజో విజయతే రామానుజో ఽ యం మునిః" అని చెప్పిన విధంగా భగవద్రామానుజులు సకలదివ్యదేశాలలోనూ అభిమానం కలిగి ఉండేవారు. మణవాళ మహామునులు కూడా " అడైవుడనే తిరుప్పతికళ్ నడంద వేర్వై యారవో!" (క్రమానుసారంగా దివ్య తిరుపతులకు వేంచేసిన శ్రమ తీరడం కోసమా!) అని చెప్పే విధంగా దివ్యదేశయాత్రలను చేసి, వాటిలో అభిమానం చూపించిన విషయం సుప్రసిద్ధం.

లేక, ఈ విధంగా కూడా వివరించవచ్చు.

దివ్య దేశాభిమానం అంటే– దివ్యదేశశ్రేణిలో చేరని స్థలాలను దివ్యదేశాలుగా అభిమానించడం. భగవద్రామానుజులు తిరునారాయణాపురానికి "ఒరునాయకమాయ్" అనే తిరువాయ్ మొ*ழி* దశకాన్ని సమర్పించి, ఆ క్షేత్రాన్ని దివ్యదేశంగా అభిమానించారు. ఆ విధంగానే, మణవాళ మహామునులు రాజమన్నార్ సన్నిధి అనే క్షేత్రానికి "తీర్పారై యామిని "అనే తిరువాయ్ మొ*ழி* దశకాన్ని సమర్పించి, ఆ క్షేత్రాన్ని దివ్యదేశంగా అభిమానించడం సుప్రసిద్ధం.

**(ఫణిరాజావతారత్వాత్)** భగవద్రామానుజులు శేషావతారభూతులు అనే విషయం జగత్ ప్రసిద్ధం. గరుడవాహన పండితుడు రచించిన దివ్య సూరిచరితంలోను, వడుగనంబి రచించిన యతిరాజ వైభవం అనే గ్రంథంలోను, ఇంకా, అనేక ప్రబంధాలలోను ఈ విషయం ప్రస్తావింపబడింది. మణవాళ మహామునులు కూడా, శ్రీవరవరముని శతకంలో "దుగ్ధోధన్వత్ ధవళ మధురం శుద్ధసత్త్వైకరూపం యస్య స్ఫుటయతితరాం యం ఫణీంద్రావతారమ్" (పాలసముద్రంవలె తెల్లని, మధురమైన, కేవలం శుద్ధమైన సత్త్వగుణాన్ని కలిగిన శ్రీమణవాళ మహామునుల రూపం, వారు ఆదిశేషాంశ సంభూతులు అనే విషయాన్ని చక్కగా, బాగా వ్యక్తం చేస్తున్నది) అని చెప్పబడడంవల్ల, ఇంకా వారి చరిత్రలో శేషాంశ సంభూతులు అని వర్ణింపబడడం వల్ల, వారు శేషావతార సంభూతులనేది సువ్యక్తం.

**(శ్రీరంగశ్రీవివర్ధనాత్)** " తెన్నరంగర్ శెల్వమ్ ము*ఱ్ఱు*మ్ తిరుత్తు వైత్తాన్ వా*ళ్లి*యే" (దక్షిణ దిక్కులో ఉండే శ్రీరంగనాథుని సంపదను అంతటిని సంస్కరించిన శ్రీరామానుజులు వర్ధిల్లాలి) అని అష్టదిక్కులలోనూ మంగళ శాసనం చేయబడే రీతిలోను, కోయిలొ*ళ్లు*గు మొదలైన గ్రంథాలలో కనిపించే ఇతిహాస విశేషాలతోనూ శ్రీరంగశ్రీని వర్ధిల్లజేసినవారు, శ్రీరామానుజులు– అనేది విశ్వవిదితం. మణవాళ మహామునుల విషయంలో కూడా ఈ విధంగానే కదా " అరంగనగర్ వా*ళ్ల* మణవాళ మామునియే! ఇన్న మొరు నూ*ఱ్ఱా*ణ్డిరుమ్" (శ్రీరంగ నగరం వర్ధిల్లేటట్లుగా, ఓ మణవాళ మహామునీ! ఇంకా ఒక నూరు సంవత్సరాలపాటు మీరు వేంచేసి ఉండాలి) అని కదా, నిత్యం మంగళాశాసనం చేయబడుతున్నది.

ఈ విధంగా ఈ విధమైన సామ్యాల వల్ల–

**(యతీంద్ర ప్రవణః సాక్షాత్ యతీంద్రో భాష్యకృత్ ధ్రువమ్)** యతీంద్ర ప్రవణులు సాక్షాత్తు శ్రీభాష్యకారులే, నిశ్చయం. యతీంద్ర ప్రవణులు అనే తిరునామాన్ని కలిగిన మణవాళ మహామునులు సాక్షాత్తు యతిరాజులే— అని అనడంలో ఏ సందేహం లేదు— అని చెప్పినట్లయినది. ఈ విధంగా నిర్వహించదగిన ఉపపత్తులు ఇంకా చాలా ఉన్నాయి. వాటిని దాసుని ఇతర గ్రంథాలలో దర్శించవచ్చు.

శ్రీమతే రమ్యజామాతృమునీంద్రాయ మహాత్మనే,
శ్రీరంగవాసినే భూయాత్ నిత్యశ్రీః నిత్యమంగళమ్.

*****